PRSVM02A152

సాహిత్య
ప్రస్థానం
ఆగష్టు 2013
సంపుటి : 12 సంచిక : 8

## స్వార్థ వ్యూహాల అనర్థం

ఆంధ్రప్రదేశ్ ఒకటిగా ఉంటుందా లేక విభజన నిర్ణయం జరుగుతుందా అన్న విషయం ఒక కొలిక్కి వచ్చినట్లుగా కథనాలు వెలువడుతున్నాయి. ఈ సమస్యపై గత అయిదేళ్ళుగా ప్రజలను అనిశ్చితికి గురి చేసిన కేంద్రం ఇప్పుడైనా సూటిగా వ్యవహరిస్తుందో లేదో తెలియదు. ఇప్పుడు తెలంగాణా ఏర్పాటుకు సుముఖంగా వున్నట్లు చెబుతూనే రకరకాల వార్తలు చలామణి చేస్తున్నారు. దానికి ప్రతిగా ఇరు ప్రాంతాల్లో వివిధ రకాలుగా వ్యూహాత్మక విన్యాసాలు కనిపిస్తున్నాయి. అత్యంత బాధ్యతా యుతంగా వ్యవహరించాల్సిన సందర్భం కూడా రాజకీయ లెక్కలు మిక్కుటమై ఆందోళనకరంగా మారుతున్నది. ఈ ఘట్టంలోనూ అటూ ఇటూ కూడా స్వార్థపూరిత రాజకీయ స్వరాలు వినిపిస్తున్నాయి. ప్రధాన పార్టీలే ప్రజలను గజిబిజికి గురి చేస్తున్నాయి. అందుకే ఇది సంధిగ్ద సందర్భం. పాలక వర్గాలు ఉద్దేశపూర్వకంగా సృష్టించిన సంక్షోభ స్థితి. ఇదిగో అదిగో అంటూనే ఎటూ తేల్చకుండా కాలం గడిపే పద్ధతి మరింత తప్పు. మరి కొన్ని మాసాలలో ఎన్నికలు రానుండగా దీనిపై అంతిమ పరిష్కారం పూర్తవుతుందా లేక ప్రకటన వరకూ వస్తుందా ప్రక్రియ ప్రారంభమవుతుందా వంటి అనేక సందేహాలు మిగిలేవున్నాయి. మీడియాలో హడావుడి తప్ప ఇదమిద్దంగా ఇదీ మా ఆలోచన అని సర్కారు వారు చెప్పిందీ లేదు. కనక ఈ సమయంలో సంయమనమే స్వార్థపర శక్తులకు సమాధానం. రాజకీయ మాయాజాలంతో రాష్ట్ర ప్రజలతో చెలగాటమాడే శక్తులకూ అదే సమాధానం. ప్రాంతాల తేడాలేమైనా ప్రజలంతా ఒక్కటే. మరీ ముఖ్యంగా పీడిత ప్రజలపై అన్నిచోట్లా దోపిడీ పీడన సాగుతూనే వుంటాయి. విభజన లేదా సమైక్యత వంటి వాటితో ఆ విధానాలు మారే అవకాశమూ లేదు. రాజ్యాంగ బద్దంగా, ప్రజాస్వామికంగా ఏ నిర్ణయమైనా తీసుకోవచ్చు. దానిపై ఎవరి అభిప్రాయాలు వారికి వుండనూ వచ్చు. అయితే బాధ్యత గల నేతలు, మరీ ముఖ్యంగా అధికారంలో వున్నవారు అవాంఛనీయమైన రీతిలో ఆవేశకావేశాలు రగల్చొల్పడం ఎవరికీ మంచిది కాదు. ప్రజలు అలాంటి వాటి పట్ల అప్రమత్తత వహించాలి.

బొమ్మలు : తుంబలి శివాజి, వెంకటేష్, భాస్కర్, రమేష్

## ఈ సంచికలో...





చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ.మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

# బంక బతుకు

- పి. లక్ష్మణ్‌రావ్
9441215989

రెండు చక్రాల సైకిల్ రథానికి
ఆరడుగుల నిచ్చెన ఒకవైపు
అరబకెట్ బంకముద్ద ఒకవైపు
ఒడుపుగా అమర్చి
సినీపోస్టర్లను సైకిల్ క్యారేజీకి తగిలించి
కార్యశూర్యుడై బయలుదేరుతాడు !
పోస్టర్లను గోడకు అంటించడమంటే
శ్వాస తీసుకున్నంత సులువూ కాదు
విశ్రాంతి తీసుకున్నంత హాయీ కాదు !
నైపుణ్యమూ, శ్రమ, బేలన్స్ మేళవిస్తేనే
అందంగా అతుకుతుంది పోస్టర్ !
మురికి కాల్వల గోడల మీద
ఉచ్చరొచ్చు గోడలపైన
పోస్టర్లను అంటిస్తున్నప్పుడు
దుర్గంధాన్ని పీల్చలేక
ఊపిరిని బంధించలేక
వాడు పడే శ్వాసయాతన
ఎంత దయనీయం !
నిలువెత్తు గోడలకు



నిచ్చెన ఆనించి, ప్రక్కకు వాలుతూ
పోస్టర్లను అంటించడమంటే
సర్కస్ విన్యాసంతో సమానమే !
అరచేతిని బంక ముద్దలో కలియబెట్టి
పోస్టర్‌కి రాస్తున్నప్పుడు
సున్నిపిండిని పిల్లాడికి రాస్తున్నట్లు
మురిసిపోతాడు !
నిచ్చెన ఎక్కుతూ ఎత్తుగోడలపై
పోస్టర్‌ని అంటిస్తున్నప్పుడు
తన పిల్లాడు తనకన్నా ఎత్తు ఎదిగినట్లు
సంబరపడిపోతాడు !
నేడు అవలంబిస్తున్న
ప్రకటనల ప్రభంజనానికి మూలమంత్రం
పోస్టర్లను అంటించడం నుండి నేర్చుకున్నదే !
మూల పురుషుడు పోస్టర్లను అంటించినవాడే !
గోడకు అతికిన పోస్టర్లలో
అందాల్నే చూస్తారు గాని
అంటించిన శ్రామికుని వైపు
కన్నెత్తైనా చూడరు !

---

# అనుకోలేదు

- కె. అనూరాధ
9618425243

అడవిలో మానునై
వందలేళ్ళుగా ఉన్న
నేను
ఎన్నడూ అనుకోలేదు
గొడ్డలి దెబ్బలు
తింటానని
ఈదురు గాలులు,
పెనుతుఫానులు,
నెన్నింటి కోర్చి,
నా కొమ్మలు విసురుగా
కొండలను తాకి
చెంపదెబ్బలు తిన్నా.
మళ్ళీ తలెత్తి నిలుచున్నాను..!
ఎన్నెన్నో శిశిరాలు వచ్చి
నా ఆకులన్నీరాల్చినా
ఎన్నడు ఒగచలేదు (బాధ)
ఎంతో ఆశతో మళ్ళీ
కొత్త చిగుళ్ళు తొడిగి నిలిచాను
సగర్వంగా !
కరెంటు తీగలకడ్డొచ్చానని
సర్కారు వారు వచ్చి
చేతులు తెగనరికినట్లు
నాకొమ్మలు తెగ నరికినా
మళ్ళీ విశాలంగా విస్తరించాను.
కానీ కళాఖండం
కోసం
ఈ గొడ్డలి దెబ్బను
మాత్రం
తప్పించుకోలేకపోయాను.
ఖరీదైన భవంతులలో
షోకేసులలో
కొండపల్లి బొమ్మగా
ఒదిగిపోయాను !!!



కథ



# ఎవడిదిరా ఈ భూమి ?

మొలకపల్లి కోటేశ్వరరావు

9963845840

"అందరూ వినండహో... రేపు పంచాయితీ ఆఫీసు కాడ నిరుడు పొలంలో దండగ పడిన రైతులు అందరికీ చెక్కులు ఇస్తున్నారహో... ఎవరి చెక్కులు వాళ్ళు వచ్చి తీసుకుపోండహో..." వెట్టి రూబేను వూళ్ళో తిరిగి చాటింపు వేస్తున్నాడు.

పొగాకు కొనుక్కోవడానికి సందకాడ పల్లెలో నించి ఊళ్ళోకి వచ్చిన మోసుకి చాటింపూ, మాటలూ చెవినపడ్డాయి. ఏమిటో బాగా అర్థంకాలేదు. సరే, చాటింపు తెలుసుకుందామని కొట్టు ముందు నిలబడ్డాడు.

వెట్టి, డప్పు కొట్టుకుంటూ దగ్గరికి వచ్చాడు.

"ఏంది రూబేను మామా... ఏందీ చాటింపూ?"

"నిరుడు గాలోనకి ఎల్లవ వచ్చి పంటలు అన్నీ కొట్టుకుపోలా ! దండగ పడిన ఆ రైతులు అందరికీ చెక్కులు ఇస్తన్నారు రేపు. మరిచిపోయా... నిరుడు నీక్కూడా దండగ వచ్చిందిగా!" చెప్పి, మళ్ళీ డప్పు కొట్టుకొంటూ వెళ్ళిపోయాడు.

ఆ మాటలు విన్న వెంటనే మోసులో అలజడి మొదలైంది.

కొట్లో జనం ఎక్కువగా వున్నారు. మోసు, షావుకారుని తొందరపెట్టి పొగాకు కొనుక్కున్నాడు.

ఇక ఆగకుండా వడివడిగా నడుచుకుంటూ, తన పెదమామ ఏబు వాళ్ళింటికి వెళ్ళాడు.

"ఏందిరా మోసూ... ఏందీ అదరా బదరా వస్తన్నావు?" ఇంటి ముందు నులక మంచం మీద కూర్చుని, మూడేళ్ళ మనమరాలికి మాటలు చెపుతున్న ఏబు అడిగాడు.

"ఏంది లేదు మామా!"

"మరి గత్తరగా వున్నావు ఏందిరా?"

"ఏం లేదు గానీ, నీ కోసం వచ్చా మామా... నిరుడు పొలంలో దండగ పడినోళ్ళకి రేపొద్దున్న చెక్కులు ఇస్తారంట మామా ! రూబేను మామ చాటింపు యేస్తున్నాడు!"

"సరే అయితే, కానీయ్!"

"ఎట్ట అయినా ఆడబ్బు మనకి వచ్చేలా చూడాలి మామా ! నిజానికి పొలంలో దండగ పడింది ఎవురూ? ఆయన మగతా ఆయనకి కట్టేం కదా? అసలు ఈ డబ్బుతో ఆయనకేం సమ్మందం? నువ్వు గట్టిగా మాట్టాడాలి మామా! ఇప్పుడు మా ఎవారం చెబితే తీరేది కాదు. చేతిలో చిల్లికాణీ లేదు. కూటికి కూడా జరగడంలా!"

"ఓర్నీ ఇల్లు దొంగల్దోలా... పరాయోడికి చెబతన్నట్టు చెబతన్నావేరా? నువ్వు ఇంతగా చెప్పాలా? నాకు తెలియదా? మనం గట్టిగానే అడుగుదాం. అయినా పెద్ద కులపోళ్ళతోటి ఎవారం..."

"పెద్ద కులపోళ్ళు అయితే ఎవురికి ఎక్కువేంది? మనం ఏమైనా అక్రుతంగా అడుగుతున్నామా? ధర్మంగా మనకి రావాల్సిన సొమ్మేగా మామా?"



"నిజమేరా ! నాకు తెలియని సంగతేం కాదు. మనం గట్టిగానే అడుగుదాం !"

"సరే, నే వస్తా మామా. పనుంది" అని ఇంటివైపు దారి తీసాడు మోసు.

మోసు వాళ్ళది ఈ వూరు కాదు. ఇక్కడికి 20 మైళ్ళ దూరంలో వున్న గుడిపాడు. ప్రభుత్వం అక్కడ గుళ్ళకమ్మ మీద ప్రాజెక్ట్ కడుతూ వూరు మొత్తాన్ని ఖాళీ చేయించింది. ఆ వూళ్ళో మోసుకి వున్న ఆస్తి అర ఎకరం పొలమూ, పూరి గుడిసె, ఒక బర్రె, జోడెద్దులూ! పూరింటికీ, పొలానికీ నష్టంగా ప్రభుత్వం 90 వేలు ఇచ్చింది, ఆ రోజుల్లో వున్న మార్కెట్ విలువ ప్రకారం.

మోసు చిన్నతనం నించీ రైతుల పొలాల్లో చాకిరీ చేసినవాడు. మంచి కష్టజీవి. మంచి పనివాడు.

మోసుకి చేతకాని పొలం పనేం లేదు. తనకి పాతికేళ్ళు వచ్చేవరకూ జీతానికే వున్నాడు.

సేద్యం గిట్టుబాటు గాక, చేసే వాళ్ళులేక, పంటల్లో మార్పులు వచ్చీ రైతులు నెమ్మదిగా ఎద్దులూ, సేద్యం ఎత్తేసారు. జీతాలకి వుండేవాళ్ళులేరూ, పెట్టుకునే వాళ్ళూ లేరు.

మోసు జీతం మానుకున్న తరువాత, బాడిగ అరకలు తోలుకుందామనే వుద్దేశంతో ఎద్దులు కొనుక్కున్నాడు. చిన్నతనం నించీ అలవాటైన పని అది.

ఒక వైపు బాడిగలు తోలుకుంటూ, తనకి ఉన్న అర ఎకరానికి తోడు, ఇంకా మూడు ఎకరాలు మగతాకి తీసుకుని పండించుకునేవాడు.

ప్రాజెక్ట్ కారణంగా వూరు ఖాళీ చేయాల్సివచ్చినప్పుడు చాలా బాధపడ్డాడు మోసు. పుట్టి పెరిగిన వూరు. అలవాటైన ప్రాంతం. తెల్సిన మనుషులు. చివరకు అందరూ చెట్టుకొకరూ, పుట్టకొకరూ అయ్యారు.

బండి మీద సామాన్లు వేసుకుని, గేదెని తోలుకుని, భార్యాబిడ్డల్ని వెంటపెట్టుకుని ఈ వూరు వచ్చాడు మోసు.

ఇది అత్తగారి వూరు.

భార్య రూతు పుట్టిల్లు ఈ వూరే. ఆమెకి ఐదుగురు తోబుట్టువులు ఉన్నారు. చాలా మంది చుట్టాలూ, చాలా బంధు బలగం వుంది.

ఉన్న వూరు విడిచిన తరువాత ఎక్కడో చోట బతకాలి కదా! ఇక్కడ అయితే బాగుంటుందనే వుద్దేశంతో కుటుంబంతో ఈ వూరు చేరుకున్నాడు.

వచ్చిన తొలి ఏడాది ఎద్దులతో బాడుగలు తోలుకున్నాడు. పెద్దగా గిట్టుబాటు కాలేదు.

పొలంలో తనకి అనుభవం వుంది. పొలం మగతాకి తీసుకుని పండించుకుందామనే కోరిక కలిగింది.

ఎద్దులు ఉన్నాయి. గవరమెంటు ఇచ్చిన డబ్బు చేతిలో వుంది. చేసే ఈడులో వున్నాడు. చేయగల సత్తా వుంది. భార్య రూతు కూడా ఇరగా మురగా చేసే మనిషి.

ఇక కావాల్సిందేం వుంది ? పొలమే !

"ఎవురిదైనా పొలం మగతాకి ఇప్పిచ్చుమామా ! ఏదో ఒక పంట యేసుకుంటాను!" అన్నాడు పెదమామ ఏబుతో.

"కనుక్కుందాం రా !" అన్నాడు ఆయన.

ఏబు అంటే మోసు భార్య రూతుకి సొంత పెద నాన్న ! కుల పెద్ద. మంచి మనిషి !

రిజర్వేషన్‌లో వూరి సర్పంచ్‌గా కూడా పనిచేసాడు. ఐదారేళ్ళు పదవిలో వున్నా రూపాయి తినలేదు.

పల్లెలోనే కాకుండా, వూళ్ళో కూడా ఆయనకి మంచి పేరు వుంది. చాలా మంది రైతులతో మంచి పరిచయాలు ఉన్నాయి.

మోసు వదలకుండా ఏబు వెంట పడ్డాడు.

మోసు అడుగుతున్న విషయం ఏబు గుర్తుపెట్టుకుని, వూళ్ళో తనతో సన్నిహితంగా వుండే రైతుల్ని కొందర్ని అడిగాడు. చివరకు ఒకరి పొలం వున్నట్లు తెల్సింది.

"రోయ్ అల్లుడూ... మనకి తెల్సిన వాళ్ళ పొలం వుందిరా ! తీసుకుంటావా, మాట్టాడిపెడతాను!"

"అంతకన్నానా? మాట్టాడు మామా! నీ మేలు మరిచిపోను"

"సరే, ప్రయాణం కా! ఆయన ఒంగోల్లో వుంటాడు. పోయి



మాట్లాడివద్దాం!"

ఇద్దరూ ప్రయాణమై ఒంగోలు చేరుకున్నారు.

ఆ పొలం ఆసామి పేరు సత్యం.

సత్యానికీ, ఏబుకీ బాగా పరిచయమే! ఇద్దరిదీ ఒకే ఈడు. చిన్నప్పుడు హైస్కూల్లో కలసి చదువుకున్నారు. ఆరు, ఏడు తరగతులు, ఏబు ఏడుతో మానుకున్నాడు. వీళ్ళు వెళ్ళేసరికి సత్యం ఇంటి దగ్గరే వున్నాడు.

"ఏరా ఏబూ... ఏమిటో పని మీద వచ్చావు?"

"పని మీదే వచ్చా సత్తెం పంతులా... ఎట్ట వున్నావు, బాగున్నావా?"

"నా బాగుకేం లేరా? ఏందీ వూళ్ళో విశేషాలూ, ఎట్ట వుంది వూరూ?

ఇద్దరూ కొద్దిసేపు వూళ్ళో విశేషాలూ, పొలం విషయాలూ రాజకీయాలూ, ఇద్దరికీ తెల్సినవాళ్ళ గురించీ మాట్లాడుకున్నారు.

వీడు ఎవుడ్రా? ఎప్పుడూ చూసినట్టు లేదే! "వీడు మాతమ్ముడు అల్లుడు పంతులా ! గుడిపాడు, గుళ్ళకమ్మ ప్రాజెక్ట్‌లో వూరు మునిగిపోతే మనవూరు వచ్చి వుంటన్నాడు. నీ పొలం మగతాకి వేసుకుంటానంటే, ఎనికీడితీ పెట్టుకుని తీసకొచ్చా!"

"నాలుగేళ్ళనించీ మనం పొలం సాగు చేసుకుంటన్న రత్తయ్య ఇయ్యేడు బళ్ళారి యెల్తా పొలం వద్దన్నాడు. ఎవురు తీసుకుంటారా అని నేనూ చూస్తన్నా!"

"అది తెలిసే నీకాడికి వచ్చాం!"

"ఇద్దరు ముగ్గురు పొలం కావాలని అడిగారు కానీ, వాళ్ళకి చోటు పెట్టలా ! సరే, నా విషయం తెల్సుగారా ఏబూ! మగతా ఎక్కువ ఇస్తామన్నా ఎవురికి పడితే వాళ్ళకి పొలం ఇయ్యను. ఏటా చేసుకునే వాళ్ళు కాదంటేనే ఇంకొకరికి ఇచ్చేది ! పొలం మాత్రం జేగర్తగా, శుద్ధంగా చేసుకోవాలి !"

"మావోడు చిన్నప్పట్నించీ పొలంలో బాగా నలిగినోడేలే పంతులా ! సొంత ఎద్దులు వున్నయ్యి ! గట్టిపనోడు. వైనంగా చేసుకుంటాడు"

"ముందే మగతా కట్టాలి, అప్పు సప్పు నా దగ్గర కుదరదు. మగతా కట్టే పొలంలో అడుగుపెట్టాలి. రేపు పండొచ్చా ఎండొచ్చా, ఎవురు చూడవచ్చారు అవన్నీ? ముందే డబ్బు కట్టించుకుంటే ఏ గొడవా వుండదు ! ముఖమాటం వద్దు ! అది నిష్ఠూరం మేలు !"

"డబ్బు కడతాంలే పంతులా! మగతా ఎంతో చెప్పు మరీ?"

"ఊళ్ళో మగతాలు ఎట్ట వున్నయ్యో చెప్పు నువ్వే?"

"మగతాలు ఒకరకంగా వుంటయ్యా? అన్ని చేలూ ఒక రకమా? గరపచేలు వుంటయ్, చౌటి చేలు వుంటయ్, రాళ్ళ చేలూ, మెరకచేలూ, పొల్లుచేలూ, అన్ని ఒకగాటిన కడతామా? దేని మగతా దానికేగా!"

"మా చేలు తెల్సు కదరా ఏబూ నీకు? మీ పల్లెకి దగ్గిరేగా మా పొలమంతా! ఏ చేలో కూడా చారెడు సచ్చు నేల లేదు. బంగార మసుంటి పొలమని తెల్సుగా నీకు ! రాంరెడ్డి ఎకరా తొమ్మిదేలు చేసి ఇచ్చాడంటగా? ఆరేటు మీద పొండి"

"రాంరెడ్డి చేలకీ, మీ చేలకీ సాపత్యమా పంతులా? నేను పుట్టి బుద్ధి ఎరిగిన కాణ్ణించీ మీ చేలు మగతాలకి ఇస్తన్నారు. ఏనాడన్నా, ఎవురన్నా ఒక్క బండి నయ్యి మట్టి తోలారూ? మీ చేలల్లో సత్తవా, సయ్యాసారం ఏం వుంది? ఎవుడికి వాడు రసం పిండుకున్నట్టు సారం పిండుకుని పోయేవాడేనాయే! నిజానికి మీ చేలల్లో ఏం వుంది పంతులా?"

"అదేందిరా అట్ట మాట్టాడతావు?"

"మరి ఎట్ట మాట్టాడమంటా? నాలుగేళ్ళకన్నా ఓపాలి నాలుగుబళ్ళు అన్నా నయ్యి మట్టి తోల్తే చేలల్లో కొద్దిగా సత్తవ వుండిద్ది! ఎంతసేపూ యూరియా, డిఏపీ లాంటి రసాయన ఎరువులు వేయడమేనాయె! ఆరేటు కాదు కానీ, ఇంకో రేటు చెప్పు?"

"ఏం చెప్పమంటా? చెప్పా కదా, రాంరెడ్డి చేలతో పొమ్మని!"

"ఆ రేటు కాదులే! ఎనిమిదివేలు కట్టుకో! వీడు మరీ కూటికి గతిలేనోడు! రెక్కలు తప్ప ఇంకో ఆసరా లేనోడు. కనీసం వుంటానికి కూడా ఇంత మట్టుకి గుడిసె కూడా అమర్చుకోలా! మా తమ్ముడు ఇంట్లోనే వుంటన్నాడు. వాళ్ళదే పెద్ద సంసారం, వాళ్ళకి తోడు ఇప్పుడు వీళ్ళు కూడా దిగబడ్డారు కొద్దిగా చూసిపో!"

ఇద్దరి మధ్యా మగతా విషయంలో చాలాసేపు బేరసారాలు సాగాయి.

చివరకు 83 వందల మీద బేరం కుదిరింది.

"చేలు బీళ్ళు చేయకూడదు, కలుపు మొక్క రాకుండా దున్నుకోవాల, గుట్లు కాడ జేగర్తగా వుండాల. కొద్దిగా సందుపోయినా పక్క చేనోడు దున్నుకుని వస్తాడు"

"తెల్సులే పంతులా! చేనేందో, చెట్టేందో, గట్టేందో తెలవనోడివి నువ్వు చెప్పాలా? అసలు నువ్వు ఆ చేలో అడుగుపెట్టి ఎన్నేళ్ళు అవతంది?"

"చేలోకా? అసలు మన వూరికి వచ్చే నేను నాలుగేళ్ళు అవతంది. మా వాళ్ళు అందరూ ఎటు వాళ్ళు అటు పోయా! మాకు అయినోళ్ళు ఎవురు ఉన్నారు వూళ్ళో? అందరూ ఇళ్ళు కూడా అమ్ముకుని పోతిరీ ! ఊళ్ళో ఏం పని వుంది మాకు? కాపరం లేకపోయేసరికి మా ఇల్లు కూడా క్రమంగా కూలిపోయింది. ఆ స్థలం అమ్ముదామంటే నీలక్కూలికి అడుగుతున్నారు"

"పొలం కూడా అమ్ముతావా పంతులా?"

"అమ్మొ... పొలమా? నా వూపిరి ఉన్నంత కాలం పొలం మాత్రం అమ్మన్రా! నేను సంపాయించింది కాదు. ఏటా మగతా డబ్బు చేతికి వస్తది! అమ్ముకుంటే ఆ వచ్చే డబ్బులు ఎటు పోతయ్యో! పొలం మాత్రం అమ్మే పని జరగదు!"

సరే, రెండు రోజుల్లో డబ్బు తీసకొచ్చి కడతాం పంతులా!"



"ఒక చేను రెండు ఎకరాలూ, ఒక చేను రెండున్నర ఎకరాలూ! మొత్తం నాలుగున్నర ఎకరాలు. ఎకరా 8 వేలా 3 వందల లెక్కన ఎంత అయిద్దో లెక్క చూసుకొండి. కొంత డబ్బు కట్టి, మిగతా కొరవా, గిరవా, చేతికి అందలేదూ అంటే కుదరదు. ముందే చెపుతున్నారా ఏబూ!"

"కొరవపెట్టంలే పంతులా!"

నాలుగున్నర ఎకరాలకీ 37 వేలా 350 రూపాయలు మగతా!

నాలుగు రోజుల తరువాత, మోసూ, ఏబూ ఇద్దరూ వెళ్ళి మగతా 37వేలు ఇచ్చారు.

"మిగతా 3వందల 50 రూపాయల్రా?"

"ఆ కొద్ది మొత్తానిదేముందిలే పంతులా! ఆ చిల్లర కూడా ఇయ్యాలా, తిండికి తికాణాలేనోడు!"

"రోయ్ ఏబూ... నాదగ్గిర అట్టాంటి పప్పులు ఉడకవు. లెక్క లెక్కగా వుండాలి. రూపాయి అయినా కొరవపడితే వూరుకోను అని ముందే చెబితినే!"

"ఛ... ఈ పీనాసితో ఎందుకు?" అనుకుని, ఏబు వెంటనే తన జేబులోనించి 350 తీసి ఇచ్చాడు.

"సరే, వస్తాం పంతులా!"

కాఫీ తాగి పోంద్రా!"

"కాఫీలూ, టీలూ మాకు అలవాటు లేదులే. ఓటలుకి పోయి రెండు ఇడ్డెన్లు తినిపోతాం!" అని మామా అల్లుడూ ఇద్దరూ వాళ్ళ ఇంట్లోనించి బయటపడ్డారు.

మంచి రోజు, మంచి ముహూర్తం, మంచి తిథీ, మంచి నక్షత్రం, మంచి సమయం అని ఏవో పిచ్చి మాటలు చెప్పే, వూళ్ళోని పిచ్చి పంతుల దగ్గరకి వెళ్ళాడు మోసు.

మంచి రోజు ఎప్పుడో అడిగాడు. చెప్పాడు పంతులు.

ఆ మంచిరోజు, మంచి ముహూర్తంలో మోసూ, రూతూ ఇద్దరూ పొలంలో అడుగుపెట్టారు. దంపతులు ఇద్దరూ జమాయించి పనిచేసేవాళ్ళు.

ఎద్దులూ, కాడీమేడీ, చట్టసాగరం అన్నీ వున్నాయి.

వాళ్ళకి ఇద్దరు ఆడపిల్లలు.

పెద్ద పిల్లకి ఐదో ఏడూ, చిన్న పిల్లకి ఏడాది.

రూతు ఇద్దర్నీ పొలం తీసుకువచ్చేది.

ఒక చెట్టుకి ఉయ్యాల వేసి, చిన్నపిల్లని ఆ ఉయ్యాల్లో వేసేది. పెద్దపిల్లని వెంట పెట్టుకుని పొలంలో పనికి వంగేది.

పొలం వాళ్ళ ఇంటికి దగ్గరగానే వుంటుంది.

భార్యా భర్తలకి ఆ పొలమే నివాసమైంది.

తెల్లవారకముందే చేలో ప్రత్యక్షమయ్యేవాళ్ళు. ఇక పూర్తిగా పొద్దు కొండల్లో పడితేనే ఇంటికి చేరుకునేది.

భార్యాభర్తలు ఇద్దరూ రెక్కలు ముక్కలు చేసుకుంటూ, నిద్రాహారాలు మరచి విపరీతంగా శ్రమించారు. అసలే పని పురుగులు. చేతిలో పొలం వుంది. కావాల్సినంత పని వుంది. ఎప్పుడూ పనిలో మునిగితేలేవాళ్ళు.

వాళ్ళ కష్టం, వాళ్ళ శ్రమ ఫలించింది.

పంట విపరీతంగా పండింది. అన్ని ఖర్చులూ, మగతాలూ పోగా 40 వేలకి పైగా మిగిలాయి. 40 వేలంటే ఆ పేద కుటుంబానికి సామాన్యమైన మొత్తం కాదు.

మోసు ఆనందానికి అంతే లేదు.

"ఏరా అల్లుడూ... పంట ఎట్ట వుంది? పర్లేదా?" అని ఏబు ఎప్పుడూ పలకరించేవాడు.

"బాగుంది మామా" అనేవాడు మోసు.

పంట అమ్మిన తరువాత ఏబు అడిగాడు. "ఏరా అల్లుడూ... మొగుడూ పెళ్ళాం ఇల్లూ వాకిలి కూడా మరిచిపోయారు. చేలోనే కాపరం పెట్టారు. ఏమైనా మిగిల్నియ్యా?"

ఏబుకి పంట విషయం, డబ్బు మిగిలిన విషయం తెల్సు. అయినా అడిగాడు, మోసుకి చెప్పడం మరీ ఆనందం. చెప్పి, అన్నాడు.

"ఏదో నీ దయ మామా... విస్తరేసి బువ్వ పెట్టావు. నీ మేలు మరిచిపోం!"

"ఛ ఛ... నేను చేసిందేం వుందిరా? మీరు కష్టపడ్డారూ, పంట పండిందీ! నాదేం వుంది?"

"వచ్చే ఏడు కూడా ఇప్పించుమామా"

"మనకే ఇస్తాడ్లే! మొండోడు, డబ్బు దగ్గిర గడ్డితినే రకం ! వాడికి కావాల్సింది డబ్బు, మనం ఇస్తన్నాం. ఇంకొకరికి ఎందుకు ఇస్తాడు పొలం? ఇయ్యడు".

ఎందుకైనా మంచిది అని, ఏబుని తీసుకుని మోసు, సత్యం వాళ్ళింటికి ఒంగోలు తీసుకుపోయాడు, "మీదటికి కూడా పొలం మేమే చేసుకుంటాం సామీ!"

"మీ ఇష్టం వచ్చినంత కాలం మిమ్మల్ని చేసుకోమంటిని కదరా! మీరు కాదంటేనే మరొకరికి ఇచ్చేది!"

రెండో ఏడాది ఎకరా 7వందలు కౌలుపెంచి, 9 వేలు చేసాడు.

ఏడాది పెద్దగా మిగల్లేదు.

కాలం జరిగిపోతూ వుంది.

3,4,5,6,7 ,8 సంవత్సరాల కాలం గడిచింది.

ఈ ఎనిమిదేళ్ళుగా సత్యం పొలం మోసు చేస్తూనే వున్నాడు.

లాభాలూ, నష్టాలూ! కానీ, చివర రెండేళ్ళు మాత్రం బాగా దండగ పడ్డాడు మోసు.

ఖర్చులు పెరిగాయి. పండించిన పంటలకి ధరలు పెరగడం కాదు, తగ్గుతున్నాయి. ఇక ప్రకృతి వైపరీత్యాలు సరే సరి!

బాగా అప్పుల పాలయ్యాడు. ఏబు దగ్గర కూడా అప్పు

తెచ్చాడు. పాపం, బాగా కష్టపడ్డాడు. నష్టపడ్డాడు.

"పింగులో పొలం ! చేసి చేసీ తీసకపోయి వాళ్ళ ఎదాన పోయడమేగా! ముగ్గురుమడుసులం, కూలికి పోయినా బోలెడు డబ్బు మిగిలివుండేది. ఎందుకు మాయదారి పొలం? చేసేం లాభం? నడుములు విరిగిపోయేట్టు ఆరుగాలం గొడ్లు మాదిరిగా చాకిరీ చేసాం. రూపాయి మిగలకపాయ! అప్పులపాలైతిమి! వద్దు మనకి పొలం!" అంది రూతమ్మ.



"వద్దంటే ఎట్టే? అప్పులన్నీ ఎట్ట పోతయ్యి? పొలంలో వచ్చిన దండగని పొలంలో పూడ్చుకోవాల్సిందే! మనకి ఇంకోదారి లేదు. ఎంతకాలం కూలి చేస్తే అప్పులు పోతయ్యి? మిగిల్నా సరే, తగిల్నా సరే, ఇయ్యేటికి వేద్దాం!"

భార్యకి నచ్చచెప్పాడు మోసు.

ఆమె అయిష్టంగానూ, బాధగానూ, భయంగానూ, దిగులుగానూ తలవూపింది.

నాలుగేళ్ళనించీ పెద్దకూతురు పొలం పనిలో రాటు తేలిపోయింది. ఇప్పుడు ఆ అమ్మాయికి పధ్నాలుగో ఏడు.

పుట్టిన కాడ్నించీ పొలంలో పెరిగిన పిల్ల. పెద్దవాళ్ళతోపాటు, ఒక్కోసారి వాళ్ళకంటే ఒకింత చురుగ్గానూ, మెరుగ్గానే పనిచేస్తుంది.

బాకీల భయంతోనూ, పొలంలో మిగిలితేనే బతుకు అనే తపనతోనూ ముగ్గురూ పొలంలో బాగా శ్రమించారు.

పండుగా పబ్బం, మంచీ చెడ్డా ఏం లేదు.

పొలమే లోకం, అదే జీవితం, అదే జీవనం అనుకున్నారు.

వాళ్ళ శ్రమా, కష్టం ఫలించింది. పంట బాగా పండింది.

ఆ దంపతులు చాలా ఆనందించారు. పంట పండితే ఏ రైతుకైనా ఆనందమేకదా?

కష్టాలు గట్టెక్కినట్లే సంతోషించారు. అప్పులు పోయినట్లే భావించారు.

పంట కోతకి వచ్చింది.

రేపు పంట కోత మొదలు పెడదామనుకున్నారు. తమకి తోడు కొంతమంది కూలీల్ని కూడా పిలిచారు.

ఇంతలోనే హఠాత్తుగా మొదలైంది, వాన... గాలి వాన... తుఫాను.. పెను తుఫాను.

దాని 'ఓగ్ని' అని పేరు పెట్టారు వాతావరణ శాఖ అధికారులు.

నిజానికి అది ఓగ్ని కాదు – అగ్ని !

అగ్ని పడితే ఎలా భస్మీపటలమై, బూడిద మిగులుతుందో అలాగే ఓగ్ని అగ్ని అయింది.

మోసు పంట మొత్తం వరదకీ, వెల్లువకీ కొట్టుకుపోయింది. కొట్టుకుపోగా, మిగిలిన గింజ నాని మొలకెత్తింది.

కోతకి వచ్చిన పంట, తినబోతున్న పంట.. నోటికాడికి వచ్చి పంట.. నోట్లో మన్నుకొట్టింది !

వ్యవసాయ అధికార్లూ, రెవిన్యూ వాళ్ళూ ఆఫీసుల్లో కూర్చుని పంట నష్టాలు రాసుకున్నారు, వాళ్ళకి తోచినట్లు !

కాలం జరిగి, మళ్ళీ పంటలు వేసుకునే అదును వచ్చింది.

మూడేళ్ళ నించీ ముమ్మరంగా నష్టాలు రావడంతో పొలాలు మగతాకి తీసుకునే వాళ్ళే లేకుండాపోయారు.

పొలం విషయం ఏమిటో చెప్పమనీ, మగతా తగ్గించి ఇస్తాననీ మూడుసార్లు మనిషిని పంపించాడు సత్యం.

తన చేతిలో పైసా డబ్బు లేదనీ, పొలం వద్దనీ, ఎవరికైనా ఇచ్చుకోమనీ మోసు వచ్చిన వాళ్ళకి చెప్పాడు.

చివరకు గత్యంతరం లేక, చాలా తక్కువకే పొలం మగతాకి ఇచ్చాడు సత్యం వేరే వాళ్ళకి. అదీ మొదట్లో కాకుండా, పంట పండి వచ్చిన తరువాత డబ్బు ఇవ్వడం !

భార్యా బిడ్డలతో పాటు, తను కూడా కూలికి వెళ్తున్నాడు మోసు.

ఆ కూలి పనులూ పెద్దగా లేవు. ఒకరోజు పని దొరికితే నాలుగు రోజులు నాగా! పదేళ్ళుగా నాలుగున్నర ఎకరం పొలం సాగు చేసి ఎంతో ధాన్యపురాశినీ, ఇతర పంటల్నీ పండించిన మోసుకి.. ఆ అన్నదాతకి ఒక్కోరోజు అన్నం కూడా వుండదు.

కూలి దొరికిన రోజు కుండ మాట్టం, లేకుంటే కడుపు మాట్టం! మంచి నీళ్ళు తాగి ముడుచుకుని పడుకోవాల్సిందే !

తుఫాను వలన నష్టపోయిన రైతులకి ఏడాది తరువాత చెక్కులు వచ్చాయి.

ప్రభుత్వం నష్టపోయిన రైతులకి కొద్దిగా అయినా నష్ట పరిహారం ఇస్తుందనీ, ఒక చిన్న బాకీ అయినా తీర్చుకోవచ్చనీ చాలా ఆశగా ఎదురు చూస్తున్నాడు మోసు, ఏడాదిగా. ఆ చెక్కులు ఇప్పుడు వచ్చాయి.

ఇంటిల్లపాది చేసిన చాకిరీ, కష్టమూ, అయిన అప్పులూ, అవసరాలూ, ఇంటి ఖర్చులూ, పిల్లలు ఎక్కి వచ్చి వాళ్ళ ఖర్చులు పెరగడం, తిండికి కూడా జరగకపోవడం అన్నీ గుర్తొచ్చి దిగులుగానూ, విచారపడుతూనూ, బాధపడుతూనూ, మరుసటి రోజు పొద్దున్నే ఏబు వాళ్ళ ఇంటికి వెళ్ళాడు మోసు.

"ఏందిరా మోసూ...'

"ఆయనకి ఫోను చేయి మామా.. చెక్కులు వచ్చిన ఎవారం ఆయనకి తెలియదుగా?"

ఏబు, సత్యానికి ఫోన్ చేసాడు.

"మా పొలం సాగుచేస్తున్న రమణయ్య నిన్ననే ఫోన్ చేసి చెప్పాడు. నేను మధ్యాహ్నం వచ్చి తీసికుంటా!" అని, సత్యం మరో మాట మాట్లాడకుండా ఫోన్ ఆపేసాడు.

"అది కాదు మామా... ఆ చెక్కు డబ్బు మా అల్లుడికి ఇవ్వాల్సిందేనని చెప్పకపోయా"

"ఓర్నీ ఆత్రం పాడుగానూ... ఫోను మీద తెగే ఎవారం అంట్రా ఇది? మనిషి వస్తాడుగా! రానీయ్ ! వచ్చిన తరువాత మాట్టాడదాం! అంత తేలిగ్గా ఇచ్చేరకం కాదులే!"



"అది కాదు మామా... ఎదవ గవరమెంటు కాకపోతే పొలం మగతాలకి చేసుకునే రైతులకి చెక్కులు ఇయ్యాలా? పొలం ఆసాములకి ఇయ్యాలా? దండగ పడింది ఎవురూ? గాలోనకి పంటలు పోయినయ్యా, దండగలు వచ్చినయ్యా అనేగా చెక్కులు ఇవ్వడం!"

"ఒరే తిక్కల ఎదవా... నువ్వు పొలం కౌలుకి తీసుకున్నట్టు రుజువేదీ, సాక్షమేదీ? కలమా కాగితమా? దస్త్రమా పత్రమా? ఏ ఆధారం వుందని నీకు చెక్కు ఇస్తారు? ఉద్యోగాలు చేసుకుంటానో, యేపారాలు చేసుకుంటానో, చేసీ సంతనలేకనో, ముసలోళ్ళు అయ్యో వూళ్ళో సగం మంది రైతులు పొలాలు మగతాలకి ఇచ్చారు. వాళ్ళందరినీ పిలిచి, విచారించి చెక్కులు ఇయ్యాలంటే గవరమెంటుకి అయ్యేపనేనా? నువ్వు పొలం మగతాకి తీసుకున్నట్టు ఆధారం ఏది? గవరమెంటు భూములో, దేవుడి మాన్యాలో చేసుకునే వాళ్ళకి ఏమైనా రాతకోతలు వుంటయ్యి కానీ మనకి ఏముంటయ్యిరా?" అన్నాడు ఏబు.

ఆరోజు కూలి పని దొరికినా, కూలి మానుకుని రూతమ్మ ఇంటి దగ్గరే వుంది.

ఏబు, మోసు పంచాయితీ ఆఫీసు కాడికి వెళ్ళారు.

"నువ్వు ఎందుకు లేవే?" అంటున్నా, వాళ్ళ వెంట రూతమ్మ కూడా వెళ్ళింది.

అక్కడ రైతులు కిక్కిరిసి వున్నారు.

చెక్కులు ఇచ్చే రెవెన్యూ వాళ్ళు ఇంకా రాలేదు.

చిన్నగా, పన్నెండు గంటల సమయంలో తాబేళ్ళు నడిచినట్టు తాపీగా రెవిన్యూ వాళ్ళు దిగారు. రైతులు నెట్టుకోవడం మొదలుపెట్టారు.

"మేం ఒక్కో పేరు పిలుస్తాం, పిలిచినవాళ్ళు రండి, అందరూ బయట వుండండి!' అన్నారు వాళ్ళు.

అక్కడ వున్న రైతుల్లో చాలా మంది పొలాలు మగతాలకి ఇచ్చినవాళ్ళు కూడా వున్నారు.

వెంకయ్య అనే రైతు ఏబుకి మంచి సావాసం, ఇద్దరూ ఒక పార్టీనే. ఆయనకి పది ఎకరాల పొలం వుంది. వయసు పెరిగి, పొలం చేయలేక మగతాకి ఇచ్చాడు ఆయన.

"ఏం ఎంకయ్యన్నా... పొలం మగతాకి ఇచ్చావుగా? చెక్కుల డబ్బు ఎవురు తీసుకునేటట్టూ?" ఏబు అడిగాడు.

"ఎవురు తీసుకునేది ఏందిరా ఏబుగా? నా పొలం మగతా నాకు ఎప్పుడో కట్టాడు. పాపం, పొలంలో వాడే కదరా నష్టపోయింది? ఈ డబ్బుకి ఆశపడటం అంటే అంతకంటే నీచం ఇంకొకటి వుండదురా! చెక్కు డబ్బు వాడికే ఇస్తాను తప్ప, నేను తాకను కూడ తాకను!" ఆయన అన్నాడు.

"నీకేంలే, ఉన్న మారాజువి!" అక్కడే వున్న మరో రైతు అన్నాడు, ఈయనకి 3 ఎకరాలు వుంటే, అది మగతాకి ఇచ్చాడు.

"ఉన్నమారాజుకానీ, లేనిపేదోడు కానీ... ఎవరైతేనేం? పొలంలో నష్టపోయిన వాళ్ళే నష్టపరిహారం తీసుకోవడం న్యాయం! పట్టాలు వుండి, పొలం వున్న వాళ్ళు బతకలేరని గవరమెంటు డబ్బు ఇస్తందా ఏంది? మన మగతా మనకి కట్టే ! మగతాకి తీసుకున్నవాడు దండగల పాలై అల్లో రామచంద్రా అని అగోరిస్తంటే, ఆ డబ్బు కోసం కక్కుర్తి పడటం కంటే దరిద్రం ఇంకొకటి లేదు!" అన్నాడు వెంకయ్య.

మగతాలకి పొలాలు వేసుకున్న వాళ్ళకే ఈ డబ్బు చెందాలని కొందరూ, అలా చెందాల్సిన అవసరం లేదని మరి కొందరూ... అక్కడ చేరిన రైతులు రెండుగా విడిపోయి ఎవరికి వాళ్ళే మాట్లాడుకోవడం మొదలుపెట్టారు.

మధ్యాహ్నం మూడు గంటల సమయంలో సత్యం, మరో మనిషిని వెంట పెట్టుకుని మోటార్ సైకిల్ మీద వచ్చాడు.

అప్పటికి జనం తాకిడి బాగా తగ్గింది.

సత్యం వస్తే, చెక్కు తీసుకుని వెంటనే వెళ్ళిపోతాడనే వుద్దేశంతో, వీళ్ళు తిండికి కూడా వెళ్ళకుండా, అక్కడే, ఆయన రాకకోసం పడిగాపులు పడుతూ వున్నారు.

సత్యం వస్తూనే బయట గేటు దగ్గర వున్న వీళ్ళ వైపు చూసి, వెంటనే ముఖం తిప్పుకున్నాడు. వడి వడిగా నడుచుకుంటూ లోపల గదిలోనికి వెళ్ళాడు.

కొద్దిసేపు తరువాత బయటకు వచ్చాడు.

"ఏం సత్తెమా..." దగ్గరకు వెళ్ళాడు ఏబు.

"ఏందిరా ఏబుగా?"

"చెక్కు ఇచ్చారా?"

"ఇచ్చారు, అయితే ఏందంట?"

"అది కాదు పంతులా...చివరి మూడేళ్ళూ వీడు మీ పొలంలో బాగా దండగ పడ్డాడు. రూపాయి మిగల్లా! చివరకి అప్పుల పాలయ్యాడు. ఇయ్యాల వీడి ఇబ్బందులు చెబితే తీరేయ్యి కాదు. తిండికి కూడా జరగడంలా! అప్పులోళ్ళు పీక్కతింటన్నారు. వాళ్ళకి ఎక్కడ తెచ్చికడతాడు? ఓగ్గి గాలోనకి పంటలు నష్టపోయినందుకేగా చెక్కులు వచ్చింది. ఈ డబ్బు మోసుకి రావాలి పంతులా!"

"అదేందిరా? ఈ డబ్బుతో వాడికి ఏం సమ్మందం?"

"ఏం సమ్మందం ఏంది పంతులా? నష్టపోయింది వాడే కానీ నువ్వు కాదుగా?"

"అంతకు ముందు మా పొలంలో వేలకి వేలు లాభాలు వచ్చినయ్యి! అప్పుడు మేమేమైనా ఇయ్యమని అడిగామా ఏంది మిమ్మల్ని?"

"ఎందుకు అడుగుతావు? నీ మగతా నువ్వు కట్టించుకున్నావు కదా? ఎవురైనా మిగల్తయ్యనేగా పొలం వేసుకునేది! వాళ్ళు కష్టపడి



పంట పండించుకుని, మిగిల్తే నీకు తెచ్చియ్యాలా ఏంది?"

"గవరమెంటు ఇచ్చిన డబ్బు మీరు అడగడం ఏందిరా? మీకేం సమ్మందం లేదురా!"

"అదేంది పంతులా మళ్ళీ మొదటికి వస్తావు? గవరమెంటు నీకు ఎందుకు ఇచ్చిందేంది?"

"ఒరేయ్ ఎందుకు మాటలు? ఈ చెక్కు డబ్బులు మీకు ఇచ్చే పని లేదు. మాకు చాలా అవసరాలు వున్నయ్యిగనీ, ఇంక అరవకుండా పొండి !"

"ఒక్కసారి ధర్మంగా ఆలోచించు పంతులా.. ఈ తొమ్మిదేళ్ళూ వీడు నీకు ఐదారు లక్షల పైగానే మగతా కట్టాడు, ఒక ఏడు ముందుగా ఇయ్యలేకపోతే, సీజన్‌లో వడ్డీతో కలిపికట్టాడు. అంత డబ్బు నీకు కట్టినప్పుడు, ఈ చిన్న మొత్తం కోసం నువ్వు కక్కుర్తిపట్టం పద్ధతి కాదు సత్తెమా!"

ఈ డబ్బు మీకు ఇవ్వడం కుదరదులేరా ఏబుగా? ఇవ్వన్లే, ఎందుకు మీకు కంఠశోష?" అంటూ కదిలాడు సత్యం, వెళ్ళిపోవడానికి, తొందరగా తప్పుకుంటే మంచిది, మాటలు పెరగకుండా వుంటాయని.

"తొమ్మిదేళ్ళు మేం మొగుడూ పెళ్ళాం చంటి పాపల్ని యేసుకుని ఆ పొలంలో రెక్కలు ముక్కలు చేసుకున్నాం. రేయింబొగుళ్ళు కష్టపడ్డాం. ఇయ్యాల ఎవురో కక్కిన కూటి కోసం కక్కుర్తిపడతన్నావ్! మా రెక్కలు మాకు ఉన్నయ్ ! మేం కొత్తగా చెడిపోయేదేం లేదు. పోయిన జలమలో ఏనా బట్టకో బాకీ వుండి ఈ జలమలో తీర్చామనుకుంటాం!" రూతమ్మ పెద్దగా తిట్లకు లేచింది.

"పెద్దంతరం, చిన్నంతరం లేకుండా ఏం మాటలే?" అక్కడ కూర్చున్న ఒక ముసలాయన అన్నాడు.

"పెద్దరికాన్ని కాపాడుకోనప్పుడు ఏం పెద్దంతరం పెద్దయ్యా? అయన పెద్దంతరం ఆయన దగ్గరే వుండిద్ది! ఎవురికి ఎక్కువేంది ఆయనంటే?" అంటూ రూతమ్మ పెద్దగా తిట్ల దండకానికి పూనుకుంది.

"ఊరుకోమ్మాయ్... ఊరుకో..." అని ఇద్దరు ముగ్గురు రూతమ్మ తిట్ల పురాణాన్ని ఆపడానికి ప్రయత్నించారు.

"ఎందుకు వూరుకోవాలయ్యా? దాని కడుపుమంట దానిది! వాళ్ళు ఎంత డబ్బు కట్టారో, ఎంత కష్టపడ్డారో, ఎంత నష్టపోయారో నాకు తెలుసు. నిజానికి అసలు భూమి ఎవురిది? ఆయనకి ఎక్కడనించి వచ్చింది భూమి? అయనేం పుడతా భూమిని వెంట పెట్టుకుని పుట్టుక వచ్చాడేంది? ఒక్కరోజు ఆయన ఆ పొలంలో అడుగుపెట్టలేదే! ఏడాదిలో ఒక్కసారి ఆ పొలం కళ్లి కన్నెత్తి చూడలేదే ! ఒక్క చెమట చుక్క చిందించలేదే ! ఒక్క గడియ పొలంలో పని చేయలేదే ! ఒక్క యిత్తు నాటడం కానీ, ఒక్క మొక్క పెంచడం కానీ చేయలేదే ! అసలా పొలం ఎట్ట వుందో, ఏ మూల వుందో కూడా ఆయనకి తెలియదే ! అయినా, ఏటా మగతా మింగుతున్నాడుగా, కడుపులో చల్ల కదలకుండా! వీళ్ళు చాకిరీ చేయటం, తీసకపోయి ఆయన ముఖాన కొట్టడం ! ఏం, ఈ చెక్కులు ఇస్తే ఆయన తాత సొమ్మేం పోయింది? పోనీ, మొత్తం కాకపోయినా ఎంతో కొంత ఇయ్యొచ్చుగా ! నష్టపోయేగా వీళ్ళు అడిగింది" అన్నాడు ఏబు కోపంగా.

సత్యం, వెంట వున్న మనిషి అప్పటికే మోటార్ సైకిల్ మీద వెళ్ళిపోయారు.

రూతు, వాళ్ళు వెళ్ళిన వైపు దుమ్మెత్తి పోస్తూ, తిడుతూ, ఏడుస్తూ భర్తతో పాటు ఇంటిదారి పట్టింది.





## జులై నెల పురస్కారాలు

| | |
|---|---|
| చాక్లెట్ అంకుల్ | చివరి చూపు |
| కథకు : రూ.700/- | కవితకు : రూ.500/- |
| రచయిత : జంద్యాల రఘుబాబు | రచయిత : మోకా రత్నరాజు |

**సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి**

మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాడు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.

వ్యాసాలకు పురస్కారాలు ✱ అభివృద్ధి పథంలో దూసుకెళుతున్న సోషల్ నెట్‌వర్కింగ్ సైట్లు, రచయిత : పి.వి లక్ష్మణరావు ✱ఎ.ఎన్. జగన్నాథశర్మ కథలు - సామాజిక, కుటుంబ సంబంధాలు, రచయిత : కె. నరసింహుడు. ఒక్కొక్కరికి రూ. 250/- చొప్పున 'కర్లపాలెం రుక్మిణమ్మ స్మారక పురస్కారం' అందజేయబడుతుంది.

- ఎడిటర్

## ఈత వచ్చినా, రాకున్నా ఒక్కటే

ఎస్.ఎస్.బి. గేరా
9492922492

వెనకట్రోజుల్లో
పగలంతా
సేద్యంతోనో, చేతివృత్తులతోనో
చెమటోడ్చిన శరీరాలను
సాయంత్రాలు సేదతీర్చేవి !
తోలుబొమ్మలాటలో, కోలాటాలో...
చిందుభాగవతాలో, చెక్క భజనలో...
బుర్రకథలో, కర్రసాములో
శ్రమజీవులను సహజ కళలు,
సమ్మోహితుల్ని చేసేవి
అమాయకత్వాలను ఆహ్లాదం,
అణువణువునా కమ్మేసేది
అలసిన శరీరాలకు,
జానపదాలు జోలపాడేవి
మరో శ్రమైక సూర్యోదయానికి సిద్ధమై
ఆ రాత్రి విశ్రమించేది !!
...............
కాలం -
కొండ కాదు,
కదలక మెదలక పడుండడానికి !
అది, సూర్యుడు సంధించి విడిచిన
కిరణ బాణం!
పారే నదిలో



ఎదురీదే చేపలా,
మారే కాలాన్ని,
దాటేయాలనుకొన్న మనిషి
ఆనందపు లోతులుచూసే ఆరాటంలో
లాభాల పల్లాలే తప్ప, విలువల తీరాలెరుగని
వ్యాపారపు వరదనీటిలో, బురదనీటిలో
విశ్రుంఖల వినోదపు సుడిగుండాల మధ్యనపడి
ఉక్కిరి బిక్కిరవుతున్నాడు
ఇప్పుడిక
ఈత వచ్చినా, రాకున్నా ఒక్కటే !
చచ్చి, ఏ ఛానల్‌లోనో తేలుతాడు
లేదా దయ్యమై,
ఫేస్‌బుక్‌లో ప్రత్యక్షమౌతాడు !
ఆత్మ నశించదు గనుక,
అది ఎస్సెమ్మెస్‌గా మారి
టవర్లచుట్టూ పరిభ్రమిస్తూ ఉంటుంది !
చివరికి,
ఏ మాయలపకీరో
ఆ మూడింటినీ కలగాపులగం చేసి, సినిమాగా తీసి
విడుదల చేయగానే
పునర్జన్మ పొందుతాడు,
ఫిక్సయిన మ్యాచ్‌లు చూసే పిచ్చోడిగా !!

## పుస్తకాలు



- డా॥ ఎన్. గోపి

ఇంటినిండా పుస్తకాలు
మనుష్యులం ఇద్దరం
ఆత్మీయతను పంచే స్నేహితుల్లా
పలకరించే ప్రియబాంధవుల్లా
ర్యాక్‌ల నిండా
సోఫాల మీదా
ఎక్కడ చూసినా పుస్తకాలే.
ప్రతి గ్రంథానికి
రెండు కాలాలుంటాయి
ఒకటి దాని పుటల్లో ఉన్నది
రెండోది నాకు లభించిన తేది.

అందమైన బౌండు బుక్కులు
ధవళశోభితమైన కాగితాల సంపుటులు
ముడితే చిట్లిపోయే
కాలం చెల్లిన గుజిలీప్రతులు
వీటికోసం నా సంపాదనలో
చాలా భాగం ఖర్చుచేశాను.
'ఏం సాధించావ్' అని ఎవరైనా నన్నడిగితే
పుస్తకాలవైపు చూపిస్తాను.

నిజానికి ఆ ప్రశ్నకు సమాధానం
ఇదికాదు

మసక చీకట్లలో
అశాంతిని రేపిన పుస్తకాలు
బతుకు భయంతో ఫికరు చేస్తున్నప్పుడు
నిద్రలేని రాత్రుల్లో
పక్కన కూర్చొని ఓదార్చిన పుస్తకాలు
ఏమీ అర్థం కాని వెర్రి క్షణాల్లో
ఉదయంలా స్పష్టత నిచ్చిన పుస్తకాలు

ప్రజల ధర్మాగ్రహాన్ని
ఉద్యమాలుగా మలిచిన పుస్తకాలు
ఇప్పుడు నేను రాసిన పుస్తకాలు కూడా
వాటి సరసన చేరాయి
'ఏం సాధించావ్' అంటే
ఈ మధ్య వాటివైపు కూడా చూపిస్తున్నాను.

ప్రతి పుస్తకం వెనుక
ఒక అపురూపమైన అనుభవం
చెరిగిపోని ఒక జ్ఞాపకం
తడియారని సెంటిమెంటు
రచయితల సంతకాల్తో
విలువ పెరిగిన ఒక సంతోషం!

ప్రపంచమంతా
మా ఇంట్లో ఉన్న మాట నిజమే!
జనం వీటి పక్కన
నన్నొక మేధావిననుకుంటారు గాని
పుస్తకాలకు తెలుసు
వాటి పుటల్లో
రాలిన నా కన్నీటి బిందువుల చారికలు
ఎన్నున్నాయో!
అలాగే ఉవ్వెత్తున లేచిన కెరటాన్నై
ఉత్తేజకావ్యాలకు ఎలా నాంది పలికానో !!

---

## కొత్తపల్లవి

- చిన్ని నారాయణరావు
9440202942



అవినీతి–
ఛత్ర చకచ్చకిత ఛాయల్లో బిక్కు బిక్కు మంటూ
బిక్కచిక్కి బ్రతుకు జీవుడా అంటూ
కాలం వెళ్ళదీస్తున్నదీ లోకం
ప్రతి ప్రక్రియకూ జరిమానాల నజరానాలు
మామూలే(ళ్ళే) నంటూ నినదిస్తున్నదీ
అధికార అహంకారం
బ్యాంకులకేదో క్యాష్ తీసుకెళ్తున్నంత అలవోకగా
కరెన్సీ బ్యాంకు ఖాతాలో జమచేస్తున్నంత అవలీలగా
ప్రతిపని ముంగిటా నిట్టనిలువునా
పైసలు తాకట్టు
ఇదే ఈ మాడ్రన్ మనిషి జన్యుకణంలోని గుట్టు
బ్రతుకు కడలి అంచుకు చేరుతున్నా
వ్యక్తి బాధల సుడిగుండాల వలయంలో
విలవిలమంటున్నా
అదిపింఛను కోసమైనా.. టంచనుగా
రూపాయి చెల్లించాల్సిందే
స్వాతంత్ర్యం వెక్కి వెక్కి ఏడవాల్సిందే
అదో వ్యసనమై కాటేసిన కారుమేఘం
మనిషితనాన్ని కబళించిన విస్ఫోటనం
అయ్యగారిప్పుడు–
రూపాయినోటుపై ఆశీసునుడైన పదితలల
అక్రమార్కుడి ప్రతిరూపం–
అదనపు సంపాదనే ఆరోప్రాణంగా
విస్తరించిన కేన్సర్ రోగంతో
ఆకాశమంతగా ఎదగాల్సిన మనిషి
బోన్సాయిగా కుచించుకుపోతున్నాడు
చీకటి ముసుగేసుకొని వెలుగు
కిరణాలకోసం పరితపిస్తున్నాడు
ఇప్పుడసలు ఆఫీసుల భాష
నోట్లకట్టల భాష
పైసల్తో పనికి త్రాసు లేసే
ఎమర్జెన్సీ ఘోష
అందుకోండి అయ్యలారా–
నాదో మనవీ సుప్రభాతం
మనిషికిప్పుడు బ్రతుకు పోరాటం
ఇకపై ఇదేదో పవిత్ర కార్యమని చాటి చెప్దాం
ఏ చట్టాలు చెప్పకున్నా మనమే చట్టబద్ధం చేద్దాం
నవీన సిటిజన్ చార్జీల సరికొత్త
నివేదికలను ప్రతిపాదిద్దాం
అయితే –
ఉద్యోగుల వేతనాలకు ఫుల్‌స్టాప్ పెడదాం
జీతాల్ని జామ్ చేశాద్దాం.. ఖజానాకు
జమచేసేద్దాం
రండి... రండి ఇకపై సరికొత్త చట్టాల్ని
రూపొందిద్దాం !

విశ్లేషణ

# కథకుడిగా వల్లంపాటి

- కె.పి. అశోక్‌కుమార్
9700000948



**జీవితంలో విలువల పతనంపై రచయిత ఆవేదనను, ఆందోళనను తెలియపరిచే కథలు మనల్ని ఆకట్టుకుంటాయి. ఆదర్శాలను వదులుకుని స్వార్థం, అవినీతి, ఆశ్రిత పక్షపాతానికి నెలవుగా మారిన రాజకీయ నాయకులను కొన్ని కథల్లో చిత్రీకరించారు. వాటితోపాటు దారిద్ర్యం, నిరుద్యోగం, దోపిడీలను చిత్రీకరించిన కథలున్నాయి. కుటుంబ సంబంధాలన్నీ ఆర్థిక సంబంధాలేనని నిరూపించిన కథలున్నాయి.**

వల్లంపాటి వెంకటసుబ్బయ్య విమర్శకులుగా సుప్రసిద్ధులు. కథావిమర్శ, నవలా విమర్శలాంటి ప్రామాణిక విమర్శా గ్రంథాలు వెలువరించక ముందే వారు కథకులు, నవలాకారులని చాలామందికి తెలియకపోవచ్చు. వారు 1958 నుండే కథలు రాయడం ప్రారంభించారు. మూడు నవలలతోటే నవలా రచనకి ఫుల్‌స్టాఫ్ పెట్టేశారు. 1992 వరకు చెదురుమదురుగా కథలు రాస్తూ వచ్చినా, ప్రధానంగా విమర్శకే కట్టుబడివుండిపోయారు. వివిధ పత్రికల్లో దాదాపు 70 కథలు రాసినా, అవి సంపుటాలుగా రాకపోవడం వల్ల విమర్శకులు సైతం వారిని కథకులుగా గుర్తించలేకపోయారు. ఇన్నాళ్లకు వల్లంపాటి సాహితీమిత్రులు పూనుకుని వారి సమగ్ర రచనల సంకలనాలను వెలువరిస్తున్న దశలో, ఇప్పటివరకు సేకరించిన 35 కథలతో "వల్లంపాటి కథలు" సంకలనం తీసుకురావడం ఆహ్వానించతగిందే.

ముఖ్యంగా జీవితంలో విలువల పతనంపై రచయిత ఆవేదనను, ఆందోళనను తెలియపరిచే కథలు మనల్ని ఆకట్టుకుంటాయి. ఆదర్శాలను వదులుకుని స్వార్థం, అవినీతి, ఆశ్రిత పక్షపాతానికి నెలవుగా మారిన రాజకీయ నాయకులను కొన్ని కథల్లో చిత్రీకరించారు. వాటితోపాటు దారిద్ర్యం, నిరుద్యోగం, దోపిడీలను చిత్రీకరించిన కథలున్నాయి. కుటుంబ సంబంధాలన్నీ ఆర్థిక సంబంధాలేనని నిరూపించిన కథలున్నాయి. ఒక ప్రొఫెషనల్‌గా ఉపాధ్యాయులు వారి రాజకీయాలను తెలియజేశారు. ఆనాటి ధోరణుల కనుకూలమైన ప్రేమకథలు కూడా రాయడంలో ఆశ్చర్యమేమున్నది ? ఇక హాస్యకథలు సరేసరి. స్వాతంత్ర్యానంతరం మనుషుల్లో పెరుగుతున్న అవకాశవాదం, విలువల పతనాన్ని ఒక కుటుంబం కేంద్రంగా తీసుకుని అల్లిన కథ "రానున్న శిశిరం". ఆదర్శవాది, స్వాతంత్ర్య సమరయోధుడి ఇంట్లో - బాధ్యతలను మరిచి మతం మార్చుకుని పెళ్ళి చేసుకుని విదేశాలకు వెళ్ళిపోయిన అవకాశవాదియైన కొడుకు, విలాసవంతమైన కోరికలు తీరకపోవడం చేత నైతికంగా పతనమైన కూతురు, ఆ తండ్రికి హృదయ శల్యంగా తయారవుతారు. తను స్వాతంత్ర్య సమరయోధుడిగా ఉద్యమంలో పాల్గొన్న పరిస్థితులు, ఇప్పుడు వున్న పరిస్థితులతో పోల్చుకుని బాధపడటం ఇందులో కనిపిస్తుంది. గతాన్ని, వర్తమానాన్ని పోల్చుకుని చెప్పడానికి చైతన్య స్రవంతి ధోరణి చాలా అనుకూలమైనది కావడం చేత ఈ కథను అదే ధోరణిలో తీర్చిదిద్దారు. స్వాతంత్ర్య యోధుడి మనసులో కొనసాగే ఆలోచనలను ఎలాంటి వడబోత లేకుండా యథాతథంగా పేర్కొనడం - ఆలోచనలన్నీ ముక్కలు ముక్కలుగా కొనసాగడం, ఒకదానికి ఇంకోదానికి సంబంధం లేకుండా సాగడం ఇవన్నీ చైతన్య స్రవంతిలో భాగమే. చేస్తున్న పనిని గొప్పగా చెప్పుకోవడం, తనకు దక్కని ఉద్యోగాన్ని తిట్టిపొయ్యడం, చాటుగా దానికోసం ప్రయత్నించడం, అదొక అవకాశవాదమని "అందని పళ్ళు"లో తెలియజేస్తారు. బంధువుల పేరిట చలామణి అయ్యే రాబందుల గురించి వివరిస్తూ అన్ని "బంధాలు" ఆర్థిక సంబంధాలే అని తేల్చి చెబుతారు. మంచితనం,

అమాయకత్వంతో రామనాథం మాష్టారు తన కష్టార్జితాన్నంతా మేనమామకు ధారపోస్తాడు. అయినా తనకు జరిగిన మోసాన్ని తలచుకుని రామనాథం మరింత కసితో సంపాదిస్తూ, మేన మరదలి కంటే మంచి అమ్మాయిని పెళ్ళి చేసుకోవాలని తలుస్తాడు. చివరకు ఆ మేనమరదలి జీవితాన్ని చక్కదిద్దడానికి రామనాథం పూనుకున్నప్పుడే అతని గొప్పదనం 'మనసులోని మల్లెలు'లో తెలియవస్తుంది. అభిమానధనుడిగా బ్రతికిన వ్యక్తి సర్వసం కోల్పోయినా భరిస్తాడు. కాని అభిమానం దెబ్బతింటే బతకలేడని "స్నేహం' కథ తెలియజేస్తుంది. "జీవిత వలయం" కథలో తన పరువు నిల్పి తనను ఆదుకున్న యువతే తన సర్వసం అనుకున్న ఉంగరాన్ని, పర్సును కొట్టేసిందన్న నిజం చివరకు తెలిసి స్థాణువైపోతాడు. ఈ కథలన్నీ మంచితనం, బంధుత్వాల మాటున దాగిన వంచనను, మోసాన్ని, అవకాశవాదాన్ని తెలియజేస్తాయి.

'వాన' కథలో జట్కాబండి అద్దె ఇరవైరూపాయలు ఖాదర్ భాషాకు ఎలా ఇవ్వాలా అని రంగయ్య బాధ. అస్పత్రి నుండి శవాన్ని మోసుకురావడానికి ఇరవైరూపాయలు డిమాండ్ చేస్తాడు. తీరా చూస్తే కారు కిందపడి చనిపోయిన ఆ శవం తన కుమారుడిదేనని తెలియడం, కృంగిపోయిన రంగయ్యకు ఖాదర్ ఖర్చుల కోసం ఇరవై రూపాయలు ఇవ్వడం కొసమెరుపు. "బండి కదిలింది" కథలో వరుస కరువులతో పెత్తందారీ రైతు రామప్పరెడ్డి బడుగు రైతుగా మారిపోతాడు. అలాగని బరువు బాధ్యతలను విస్మరించలేడు. దానికోసం అప్పుల ఊబిలో చిక్కుకోక తప్పదు. అతని పాలేరు నాగన్న కుటుంబం కరువు దెబ్బకు నాశనమైపోతుంది. గతాన్ని తలచుకుంటూ వర్తమానంలో బతుకలేకపోతున్న వాళ్ళకు ఆత్మహత్యలే పరిష్కారంగా తోచడంలో ఆశ్చర్యమేముంది? చెడి బతికిన రాఘవయ్య చేసిన పరాభవాన్ని బతికిచెడ్డ రంగారావు భరించలేకపోతాడు. రాఘవయ్యను మించిపోవాలనే కోరికతోనే, అవి నెరవేరకుండానే రంగారావు మరణించడం, అతడ్ని "పరాజితుడి"గా మిగిల్చివేస్తుంది. "బడబాశిఖ' కథలో నాయుడికి నమ్మినబంటులా వుంటా వాడు చెప్పిన అకృత్యాలను చేసిన వీరేశు చివరకు పశ్చాత్తాపంతో కుమిలిపోతూ నాయుడ్ని చంపి ఆత్మహత్య చేసుకుంటాడు. వీరేశుకు ఈ సలహానిచ్చిన రచయితను పోలీసులు అరెస్టు చేస్తారు. ఈ కథలన్నీ ఆర్థిక దోపిడిని తెలియజేస్తాయి. తల్లిని కాకుండా కూతుర్ని కూడా లొంగ తీసుకుందామని ప్రయత్నించే రాఘవయ్య కుట్ర నుండి తప్పించుకుని ఆ తల్లి ఎలా "విముక్తి" పొందిందో వివరించేది ఇంకో కథ. జీవితంలో అన్ని కోల్పోయి తనను తానే అమ్ముకోవాల్సిన పరిస్థితిలో ఒక అభాగిని. ఆమె కథను నవలగా మలచిన రచయిత తానూ ఎలా మోసగింపబడ్డాడో తన నిస్సహాయతను, డబ్బు కోసం జరిపే బతుకు పోరాటాన్ని ఆ అభాగినితో పోల్చుకుని చూడడం "జీవన విపణి"లో కనిపిస్తుంది. రాజకీయ నాయకులు చుట్టూ ప్రదక్షణలు చేసే నిరుద్యోగులు ఎంతోమంది వుంటారు. ఈ నాయకులు తమ వాళ్ళకు, తమకు పనికొచ్చే వాళ్ళకు మాత్రమే ఉద్యోగాలు ఇచ్చుకుంటారన్న నిజం తెలుసుకున్నప్పుడే వాళ్ళ పట్ల వున్న భ్రమలు తొలగిపోతాయని చెప్పే కథ 'నేనింకా నిరుద్యోగినే" దగ్గరి బంధువైన యం.ఎల్.ఏ దగ్గరకు ఉద్యోగ రెకమండేషన్ కోసం వచ్చిన శేఖరం - అవినీతిపనులు, అన్యాయాలకు ఎమ్మెల్యే చేసే రెకమండేషన్లు, అతని నిజస్వరూపం చూసి కళ్ళు తెరుచుకుంటాయి. అది 'ధర్మనిలయం' కాదు, అధర్మ నిలయమని తెలుసుకుంటాడు. రాజకీయ చదరంగంలో తమ కుటుంబ సభ్యుల్ని పావులుగా వాడుకోవడానికి కూడా నాయకులు వెనుకాడరని "గాయపడిన దేవత" తెలియజేస్తుంది. తరతరాలుగా కొనసాగుతున్న పగలు మరిచి వియ్యంతో కలసిపోవాలనుకున్న రెడ్లు. ఆ రాజకీయ సర్దుబాటులో తను బలిపశువు నన్న సంగతి తెలుసుకున్న పెళ్ళికూతురు. తండ్రిని ఎదిరించలేక తలొగ్గాల్సిన కూతురి దయనీయ పరిస్థితిని ఈ కథ అద్భుతంగా చిత్రీకరించింది.

**"పరిష్కారం" కథలో లలిత ఉద్యోగం వల్ల వాళ్ళ కుటుంబం బతకగలుగుతుంది. అందుకే ముప్ఫయి అయిదేళ్ళు గడుస్తున్నా లలిత పెళ్ళి కోసం ఎవరూ ఆలోచించరు. స్నేహితురాలైన నీరజ ఒక మంచి సంబంధం తెస్తుంది. ఆమె శీలం మంచిది కాదనే చెప్పుడు మాటలతో వరుడు తిరస్కరించగా, లలిత ఆత్మహత్య చేసుకుంటుంది. వరుడికి ఆ మాటలు చెప్పింది ఎవరో కాదు. ఆమె తండ్రే కావడం మరింత విషాదం.**

తన అహంభావం, నిరంకుశత్వంతో కుటుంబాన్ని, తన జీవితాన్ని నాశనం చేసుకున్న వ్యక్తి కథ "పరిధి" "పరిష్కారం" కథలో లలిత ఉద్యోగం వల్ల వాళ్ళ కుటుంబం బతకగలుగుతుంది. అందుకే ముప్ఫయి అయిదేళ్ళు గడుస్తున్నా లలిత పెళ్ళి కోసం ఎవరూ ఆలోచించరు. స్నేహితురాలైన నీరజ ఒక మంచి సంబంధం తెస్తుంది. ఆమె శీలం మంచిది కాదనే చెప్పుడు మాటలతో వరుడు తిరస్కరించగా, లలిత ఆత్మహత్య చేసుకుంటుంది. వరుడికి ఆ మాటలు చెప్పింది ఎవరో కాదు. ఆమె తండ్రే కావడం మరింత విషాదం. "మిధ్యా బింబం" కథలో కాముకి, వ్యభిచారియైన భార్య వల్ల విరక్తి కలిగి అందరికి దూరంగా టీచర్‌గా బతుకుతున్న ప్రభాకరం గతం గురించి ఎవరికీ తెలియదు. హఠాత్తుగా ప్రభాకరం ఆత్మహత్య చేసుకోవడం వెనుక ఉన్న కారణం మిత్రుడైన రచయితకు చివర్లో తెలుస్తుంది. భార్య ఆధిపత్యాన్ని భరించలేక ఉద్యోగం మానేసి పారిపోయిన భ్రష్టుడై తాగుబోతుగా తిరిగివచ్చిన భర్త కుటుంబాన్ని వేధిస్తూ, హడలగొడుతూ బతికేయడం "ప్రతిధ్వనులు"లో కనిపిస్తుంది.

కుటుంబ యజమాని స్వార్థం, అహంకారం వల్ల జీవితాలే నాశనమవుతాయని మొదటి రెండు కథలు వివరించగా, మిగతా రెండు కథలు భార్యా బాధితుల గురించి వ్రాసినవి. "అనుబంధాలు" కథలో డబ్బుకోసం ధనవంతులకు అబ్బాయిని దత్తత ఇస్తారు. మమకారం చంపుకోలేని కన్నతల్లిని బాబు వైపుకు రాకుండా చేస్తారు. తీరా బాబుకు మశూచి పోస్తే పెంపుడు తల్లి దూరంగా వుంటే, కన్నతల్లి వచ్చి శుశ్రూష చేసి బిడ్డను దక్కించుకుంటుంది. బిడ్డకోసం ప్రాణాలు లెక్కచెయ్యని మాతృత్వం నీలో వుంది. అది వున్నచోటే బాబు వుండాలని తిరిగి బాలుడ్ని అప్పగిస్తారు. కన్నతల్లికి కూడా మశూచి సోకిందనగానే, నా బిడ్డ దక్కాడు. నాకేమయినా ఫర్వాలేదనడంలో ఆమె మాతృహృదయం కనిపించింది. ఎంత పెంచిన ప్రేమ అయినా కన్న ప్రేమకు సాటిరాదని ఈ కథ మరోమారు తెలియజేస్తుంది. బ్రాహ్మణపిల్ల జానకి కమ్మవాళ్ళ ఇంటికి పెంపుడు కూతురిగా వస్తుంది. 'జానకి పెళ్ళి' కోసం మంచి సంబంధం చూడగా, కన్నతల్లి తమ కులంలోని వ్యక్తికే పెళ్ళి చేయాలనుకుంటుంది. దానికి ఒప్పుకోక పెంపుడు తండ్రి తమ కులంలోనే చేయాలను కుంటాడు. ఇరువైపులా పంతాలు, పట్టింపులతో పోట్లాడుకుంటుంటే జానకి తాను ప్రేమించిన వ్యక్తిని పెళ్ళి చేసుకుంటుంది. అప్పుడు ఇరు కుటుంబాలు సంతృప్తి పడక తప్పని కారణాలు కూడా గమత్తుగానే వుంటాయి. కులం మన జీవితంలో విడదీయరాని అంశంగా మారిపోయింది. ఎంత ఎత్తుకు ఎదిగినా, ఎన్ని అభ్యుదయ భావాలు వెదజల్లినా కులాభిమానాన్ని వదులుకోలేరు సరికదా భద్రంగా పెంచి పోషించుకుంటారని ఈ 'జానకి పెళ్ళి' అనే కథ మరోమారు నిరూపించింది.

రచయిత బోధనావృత్తికి సంబంధించినవాడు కావడం వల్ల టీచర్లను ప్రధాన పాత్రలుగా పెట్టి కొన్ని కథలను రాశారు. "అల్ప సంతోషులు" కథలో హెడ్మాస్టర్‌కు, స్థానికుడైన అసిస్టెంట్ టీచర్‌కు మధ్యన గల ఆధిక్యతా పోరాటంలో బడి మూతబడటం, పనిష్‌మెంట్‌గా వారిద్దరు దూర ప్రాంతాలకు బదిలీలు కావడం జరుగుతుంది. వీళ్ళిద్దరి అహంకారం వల్ల సమితి ప్రెసిడెంటు ఎలా లాభపడ్డారో ఈ కథ వివరిస్తుంది. "తీరని ఋణం" కథలో కులబలం, స్థానబలం కారణంగా టీచర్లను వేధించిన సీతారామయ్య నిరంకుశత్వానికి, అహంకారానికి ప్యూను చలమయ్య కూడా బలవుతాడు. రిటైర్‌మెంట్ తర్వాత సీతారామయ్య ఆర్థిక పరిస్థితి క్షీణించగా, చలమయ్య ఆదుకోవడం చూసి తన అల్పత్వాన్ని జ్ఞాపకం చేసుకుని కుమిలిపోతాడు. ఈ రెండు కథలు టీచర్ల అహంకారాన్ని, వారి మధ్య వుండే ఆధిక్యతా పోరాటాన్ని తెలియజేస్తాయి. ఊరి రాజకీయాలను ఆసరా చేసుకుని ఎలా పెట్రేగిపోతారో ఈ కథలు తెలియజేస్తాయి. 'కోరిక తీరిన వేళ' కథలో ఎలిమెంటరీ గ్రేడ్ టీచర్‌గా పనిచేసే సూర్యం, జగన్నాథం మేష్టారు చలవతో పరీక్షలు పాసయి, చివరకు జగన్నాథం పనిచేసే స్కూలుకే హెడ్మాష్టర్‌గా వస్తాడు. జగన్నాథం భార్య పాము కాటుతో మరణించగా, ఆమె చివరి కోరిక తీర్చడానికి టీచర్ ట్రైనింగ్ పరీక్ష కట్టి, సర్వశక్తులు ఒడ్డి ఉత్తీర్ణత సాధించినా, ఆ అధిక శ్రమతో కన్ను మూస్తాడు. అనాథగా మిగిలిపోయిన వారి కొడుకు బాధ్యతను సూర్యం స్వీకరిస్తాడు. ప్రమోషన్లు రావాలంటే, పైకెదగాలనుకుంటే విద్యార్హతలను పెంచుకోవాలి. ఈ రకమైన పోటీ ఎదుగుదలకు దోహదపడుతుంది. ఇవే కాకుండా మరికొన్ని కథలలో టీచర్ ప్రధాన పాత్రధారిగా కనిపిస్తాడు. "మనసులోని మల్లెలు" కథలో రామనాథం ట్యూషన్లు చెప్పి బోలెడంత డబ్బు గడిస్తాడు. ఆయన డబ్బు సంపాదించడానికి టూషన్లను ఎంపిక చేసుకుంటాడు. అలాగే "మిధ్యాబింబం" కథలో ప్రభాకరం భార్య నుండి తప్పించుకోవడానికి దూరంగా వచ్చి టీచర్‌గా బతుకుతుంటాడు. ఈ టీచర్ జీవితంలోని విషాదాన్ని ఆ కథ తెలియజేస్తుంది.

**1958 - 1992 వరకు అనగా 34 ఏళ్ళ వ్యవధిలో వల్లంపాటి వెంకటసుబ్బయ్య రాసిన ఈ కథలు ఆనాటి ధోరణులు, అప్పటి ఆలోచనా విధానాన్ని ప్రతిబింబింపజేస్తాయి. వీటిలో కొన్ని మంచి కథలున్నాయి. కొన్ని మామూలు కథలున్నాయి. కాలానుగుణంగా రాస్తున్నప్పుడు ఈ ఇబ్బంది తప్పకుండా ఏర్పడుతుంది. ఇందులో ఎక్కువ భాగం కథలు మానవ మనస్తత్వ చిత్రణకే అధిక ప్రాముఖ్యతనిచ్చాయి. మనుషులలో పెరుగుతున్న స్వార్థం, అవకాశవాదం వాళ్ళను ఎలా భ్రష్టు పట్టిస్తున్నాయో చెబుతారు.**

ప్రేమ - వియోగం అనే అంశంపై అయిదు కథలు రాయటం విశేషం. "జాలరి బాల" అనే కథలో ప్రేమించిన ప్రియురాలు దూరమైందని అవివాహితుడిగా మిగిలిపోయిన జగన్నాథం చివరకు స్కూల్ టీచర్‌గా పని చేస్తున్న సీతను పెళ్ళి చేసుకుంటాడు. రిటైరయిన చాలా కాలానికి గాని సీతనే, ఒకప్పటి తన ప్రియురాలని తెలుసుకోలేకపోతాడు. "దీపో పునర్జ్వలతి" కథలో మేనమామ గిరిధర్‌ను తిరస్కరించిన పార్వతి, ప్రేమించి పెళ్ళిచేసుకుంటుంది. భర్తను, పురిట్లో పిల్లను పోగొట్టుకున్న పార్వతి - ప్రసవంలో తల్లి చనిపోగా అనాథగా మిగిలిన బిడ్డకు చేరవవుతుంది. తీరా చూస్తే ఆ పాప గిరిధర్ కూతురు. ఆ పాప వల్లే వారి జీవితాలు ఏకమవుతాయి. ఇందులో పార్వతి పాపకు పాలు ఇవ్వడం, ఆ పాప కావాలనడం, గిరిధర్ పిచ్చి కోపంతో తిరస్కరించడం, ఆ తర్వాత హఠాత్తుగా వాళ్ళు దంపతులుగా కనిపించడం అంతా అసహజంగా, కృత్రిమంగా తయారయింది. "అన్యథా శరణం నాస్తి" కథలో తను ఎంతగానో ప్రేమించిన బావ పెళ్ళయిన కొద్దిరోజులకే చనిపోవడం లలితను

విరాగిగా తయారుచేస్తుంది. చెల్లెలు గిరిజ కోసం వచ్చే ఉమాపతి స్నేహం వల్ల, లలితలో వచ్చిన మార్పులను చూసి గిరిజ అపార్థం చేసుకోవడంతో ఆమె ఆత్మహత్య చేసుకుంటుంది. లలిత వైరాగ్యం, మంచితనం ఆఖర్లో అందరికి తెలుస్తాయి. ''సమాంతరాలు'' కథలో భ్రమరచే తిరస్కరింపబడి అవివాహితుడిగా మిగిలిపోయిన డాక్టర్ సారధి, భ్రమరను తిరస్కరించి వేరే పెళ్ళి చేసుకున్న శేఖరం, ఒంటరిగా - విరాగిగా మిగిలిపోయిన భ్రమర జీవితాలు సమాంతర రేఖలుగా మిగిలిపోయారని కథకుడు సూచించిన విధానం బాగుంది. సరోజకు తెలియకుండా సుశీలను, సుశీలకు తెలియకుండా సరోజను పెళ్ళిచేసుకుని కాపురం చేసి పారిపోయిన డాక్టర్ వల్ల వారి జీవితాలు ఎలా చిందరవందర అయ్యాయో "ఆగంతుక" కథ తెలియజేస్తుంది. ప్రేమ - మోసం - త్యాగం చుట్టూ తిరిగే ఈ కథల్లో లేనిపోని ఆదర్శవాద ధోరణులతో ఈ కథలు అసహజంగా, ఔత్సాహిక రీతిలో ఉండటం గమనార్హం.




డబ్బుల్లేవన్న సాకుతో నాయనమ్మ కాశీ యాత్రను అడ్డుకోబోయి విఫలమై, చివరకు అప్పుచేసి ఆ కోరికను తీర్చాల్సిరావడం హాస్యభరితంగా చిత్రీకరించడం "తెచ్చుకున్న ముప్పు''లో కనిపిస్తుంది. అమ్మాయిలను ఆకర్షించలేక విరక్తితో సన్యసించిన ముగ్గురు మిత్రుల కథే "మిత్రత్రయం" మంచి వాళ్ళను కూడా పిచ్చివాళ్ళలా తయారుచేసే ఈ ప్రపంచ పోకడను వ్యంగ్యంగా చిత్రీకరించిన కథ 'పిచ్చాసుపత్రి'' కాగా, అప్పులు చేయడం ఒక కళ అని నిరూపించడం "కళా రహస్యం"లో కనిపిస్తుంది. "ఎదురు చూడని క్షణం''లో వాళ్ళ ధోరణి వాళ్ళదే కాని ఇతరుల మాట వినిపించుకోని మనుషులు కొంతమంది వుంటారు. చావు కబురు మోసుకొచ్చిన వ్యక్తికి చెప్పే అవకాశం ఇవ్వకుండా, తన మాటల్లో సుందరమ్మ వైఖరిని సింపుల్‌గా, సరదాగా చిత్రీకరించిన విధానం బాగుంది.

1958 - 1992 వరకు అనగా 34 ఏళ్ళ వ్యవధిలో వల్లంపాటి వెంకటసుబ్బయ్య రాసిన ఈ కథలు ఆనాటి ధోరణులు, అప్పటి ఆలోచనా విధానాన్ని ప్రతిబింబింపజేస్తాయి. వీటిలో కొన్ని మంచి కథలున్నాయి. కొన్ని మామూలు కథలున్నాయి. కాలానుగుణంగా రాస్తున్నప్పుడు ఈ ఇబ్బంది తప్పకుండా ఏర్పడుతుంది. ఇందులో ఎక్కువ భాగం కథలు మానవ మనస్తత్వ చిత్రణకే అధిక ప్రాముఖ్యతనిచ్చాయి. మనుషులలో పెరుగుతున్న స్వార్థం, అవకాశవాదం వాళ్ళను ఎలా భ్రష్టు పట్టిస్తున్నాయో చెబుతారు. ఆదర్శాలకు మంగళం పాడి విలువల పతనానికి సిద్ధమవుతున్న మనుషుల ఆరాటాన్ని ఈ కథలు చక్కగా చిత్రీకరించాయి. ఆకలి, దారిద్ర్యం, నిరుద్యోగంతో సతమతమవుతున్న వ్యక్తుల జీవన పోరాటాన్ని మరికొన్ని కథలు చిత్రీకరించాయి. వీటిలో ఆర్థిక అవసరాల కోసం ఎంతటి నీచానికైనా వెనుదీయని వ్యక్తులు ఇంటా-బయటా కనిపిస్తారు. కుటుంబ సంబంధాలు కూడా అందుకు అతీతంగా లేవని ఈ కథల్లో నిరూపిస్తారు. ప్రేమ కథలకంటే హాస్య కథలను తీర్చిదిద్దడంలో రచయిత మంచి నేర్పు ప్రదర్శించారు. ముఖ్యంగా కరువు దెబ్బకు చితికిపోయిన రైతు కథ "బండి కదిలింది" రాజకీయ చదరంగంలో "గాయపడిన దేవత" కథ, టీచర్ల రాజకీయాలను వివరించే కథలు, కులం మన జీవితంలో ఎంత విడదీయరాని అంశంగా మారిపోయిందో తెలిపే "జానకి పెళ్ళి" కథ - మరిచిపోలేని వైవిధ్యభరితమైన కథలుగా చెప్పుకోవాలి. ఇవన్నీ ఒక ఎత్తు. శిల్పపరంగా తీర్చిదిద్దిన "రానున్న శిశిరం, ప్రణయ సేతువు" కథలు మరో ఎత్తు. "రానున్న శిశిరం" కథను చైతన్య స్రవంతి పద్ధతిలో తీర్చిదిద్దినా కాలం, స్థలం విషయంలో మరింత శ్రద్ధ తీసుకుంటే బాగుండేది. రచనా పరంగా చూస్తే బుచ్చిబాబు, నవీన్ చైతన్య స్రవంతి కథలలో కనిపించే ప్రవాహశైలి ఇందులో లోపించింది. చివరకు శ్రీశ్రీ కోనేటిరావు కథల ముందు కూడా ఈ కథ తేలిపోతుంది. అందుకే ఎవరూ ఈ కథను చైతన్య స్రవంతి కథగా గుర్తించలేకపోయారు. చివరకు స్వయంగా రచయితే చెప్పుకోవాల్సిరావడం ఆయన వైఫల్యంగానే భావించాలి. ఇక ''ప్రణయసేతువు'' కథ ప్రతీకాత్మకం. నదులన్నీ సముద్రంలోనే కలుస్తాయి. మానవ సాంకేతిక అభివృద్ధి ఫలితంగా నదుల మీద ఆనకట్టలు కట్టి కరువు కాటకాలను రూపుమాపుతున్నారు. ఈ విషయాన్ని ప్రతికాత్మకంగా అంటే - నదిని స్త్రీగా, సముద్రుడ్ని పురుషుడిగా చిత్రీకరించి వారి కలయికను అడ్డుకున్న మానవుడి దీక్షను, ప్రయత్నాన్ని "ప్రణయసేతువు" కథ వివరిస్తుంది. ఇందులో ఒకవైపు నదీ, సముద్రుడిల ప్రేమ - వియోగాన్ని హైలెట్ చేస్తూనే, ఇంకోవైపు మానవ మేధస్సు గుర్తించి ప్రశంసిస్తారు. రెండు అంశాలకు సమ ప్రాధాన్యత ఇవ్వడం వల్ల కథా ప్రయోజనమే దెబ్బతింది. మానవ మేధస్సు గురించి చెప్పదలుచుకుంటే నది - సముద్రుడిల గొడవే అవసరం. ఈ కథ చదువుతుంటే "వసుచరిత్ర" అనే ప్రబంధం తప్పక గుర్తువస్తుంది. అందులో కోలాహలుడనే పర్వతానికి, శుక్తిమతి అనే నదికి మానవారోపణ చేస్తూ నడిపిన కథ ఇలాగే వుంటుంది. ఇలాంటి ఇతివృత్తం కథకంటే పద్య కావ్యానికే బాగా కుదురుతుంది. మొత్తానికి ఈ కథలన్నింటినీ వైవిధ్య భరితంగా, ఆసక్తికరంగా చిత్రీకరించడం ద్వారా రచయిత కథా విమర్శకుడిగానే కాకుండా, కథా రచయితగా కూడా తమ స్థానాన్ని సుస్థిరపరచుకున్నారనే చెప్పాలి.



# పూల సైనికులు

జగద్ధాత్రి



వేసవి వచ్చిందంటే చాలు
నా కళ్ళు వాటి కోసమే వెదుకుతాయి
అంతవరకూ కామప్లాజ్‌లో దాక్కున్న
పోరాట వీరుల్లా ధైర్యంగా పూసి
రోడ్డు కిరువైపులా ఠీవిగా నిలబడి
రెడ్ శాల్యూట్ కొడతాయవి
ఒక్కో చెట్టూ కొన్ని వేల ఎర్రజండాల సమూహం లా
ప్రపంచ కార్మికులంతా ఏకం కండి అన్నట్టు
వేనవేలుగా ఏకమై ఒక్కో చెట్టును రుధిర తేజస్సుతో నింపుతాయి
తురాయి లంటారట వాటిని
ఏ రాజు, ఏ జమిందారు తల పాగాలోనో
తురుముకున్న తురాయిల్లా ఉన్నాయని
ఎవరో తెలియని వాళ్ళు పెట్టి ఉంటారా పేరు
నాకు మాత్రం అవి నెత్తుటి కళ్ళు లాగా
విప్లవ సైనికుల్లాగా కనిపిస్తాయి
చిన్నపుడు చూస్తే ఎర్రటి రంగుతో
అందంగా ఉండేవి అనిపించేది
యవ్వనంలో చూస్తే సమధర్మం కోసం పోరాడే
యువనాయకుల్లా ఔపించేవి
ఈ నడి వయసులో మాత్రం నిర్ధారణగా చెప్పగలను
విప్లవ తేజాల్లా, మండే మంకెన జ్వాలల్లా
నిలువెత్తు ఎదిగిన ఉద్యమం లా
ఒక్కో చెట్టూ ఒక్కో మాట కాక
అన్ని చెట్లూ శతకోటి గొంతులు కలిపి
వైప్లవ్య గీతాన్ని పాడుతోన్నట్టు
నూతన సమాజాన్ని ఆహ్వానిస్తున్నట్టు
అమేయమైన జీవన స్వప్నాలని
సాకారం చేసుకుందికి ఆయుత్తమయినట్టు
అటెన్షన్ !!! అంటూ లాల్ సలాం చెబుతోన్న
అడవి జ్వాల పూలను చూస్తే
ఎందుకో ప్రతి వేసవీ ఎదలో ఏదో
మాటల కందని భావనలు మెదిలి
ఇన్నేళ్ళకి నా ఎదలో సదా మెదులుతున్న
ఈ సిందూరపు ఎరుపు పూలు నేటికి
నే చెప్పీ చెప్పలేని అక్షరాలలో ఇలా ఒదిగిపోయాయి.

---

# గజల్

బి. ఇందిర
7396303552



మనసంతా వసంతమై మురిపిస్తేనె బాగు బాగు
పొగలు - సెగలు ఈ గజలే హరిస్తేనే బాగు బాగు
గుండెలోన చెలిమింగ ఆవిరిగా మారిందా
నీవె భగీరథునిగవతరిస్తేనే బాగు బాగు
మమతలెన్ని పంచితేమి మదిపేదయిపోతుందా
దాచుకున్న ఎదబరువే, కురిస్తేనే బాగు బాగు
మానవుడనిపించుకొనగ బతుగ ఒకటె చాలదులే
ప్రేమ అనే వరముతోనే తరిస్తేనే బాగు బాగు
పనికిరాని పగలుబూని శాపగ్రస్తులైన వేళ
నిముషమైన మనుషులమని స్ఫురిస్తేనే బాగు బాగు
రూపు చూసి నరుని జాడ పోల్చలేవు ఓ 'ఇందిర'
మానవతా పతాకాన్నె ధరిస్తేనే బాగు బాగు
ఏమి ఫలము వెదుకులాడ నీడకొరకు ఎడారిలో
హృదయమందె నందనాలు విరిస్తేనే బాగు బాగు
సాహసాలు శ్వాసించే 'నిర్భయ'లకు జోహారులు
అతివ అబల అన్నమాట మరిస్తేనె బాగు బాగు
పిలుపులోనే విజయవైతె ఏమి లాభమో ఉగాది !
పేరు సార్ధక ముగనీవు మెరిస్తేనే బాగు బాగు.

కథ

# చీకటి చివర్లో వెల్తురు



సలీం
9849386327

బస్ దిగి యింటి వైపుకి నడుస్తున్నాను.... భయం భయంగా.

ఎవరేం కామెంట్ చేస్తారోనన్న భయం... అది పదునుగా మనసుని గాయం చేస్తుందేమోనన్న భీతి... ఎదురుగా వచ్చేవాళ్ళకు వీలైనంతగా నా మొహం కన్పించకుండా తల వొంచుకుని నడుస్తున్నాను. బస్‌లో గుచ్చుకున్న చూపులు యింకా సలుపుతున్నాయి... వాళ్ళ కళ్ళల్లో కన్పించిన ఆశ్చర్యం, అవహేళన... వాళ్ళ కనుగుడ్లు పీకేయాలన్నంత కోపాన్ని దిగమింగుకుని... ఎన్నేళ్ళ నుంచి ఈ బాధల్ని మోస్తున్నానో... పుట్టినప్పటి నుంచీ...

ఎదురుగా యిద్దరు కుర్రవాళ్ళు వస్తున్నారు. మా యింటికి దగ్గరే వాళ్లిల్లు కూడా.

మరింత బిగుసుకుపోయి తలని భూమిలోకి పాతేసి నడుస్తున్నాను. నా సిక్త్ సెన్స్ చెప్తోంది వాళ్ళు తప్పకుండా ఏదో అంటారని... నా వొళ్ళంతా చెవులు మొలిచాయి. వాళ్ళని దాటి కొద్దిగా ముందుకునడిచాను. హమ్మయ్య ఏమీ జరగలేదు అనుకుంటున్నంతలో బాంబులా శబ్దం పేలింది.

"నాకు చీకటంటె బయ్యం" ఏదో సినిమాలో పాట ఒకతను ఎత్తుకున్నాడు.

"అమ్మో... నాకు మరీ బయ్యం" రెండోవాడు వంత పాడాడు.

వాళ్ళ చొక్కాలు పట్టుకుని ఆ చెంపా ఈ చెంపా కసితీరా వాయించాలన్నంత కోపం... సినిమాలో పాట పాడుకుంటే నీకేంటి మధ్యలో... నువ్వెందుకు భుజాలు తడుముకుంటావు' అని ప్రశ్నిస్తే నా దగ్గర సమాధానం లేదు. నా అసహాయత మరింత వెక్కిరిస్తూ... తన్నుకు వస్తున్న ఏడుపుని బలవంతంగా ఆపుకున్నాను.

యింట్లోకి వెళ్ళబోతున్నపుడు వెనకనుంచి మాటలు వినపడ్డాయి. "రేపు అమావాస్య...మంచిది కాదు" అంటున్నారెవరో. చప్పున వెనక్కి తిరిగి చూశాను. అతను నావైపు పళ్ళికిలిస్తూ చూశాడు. బగ్స్ బన్నీలా ఎత్తు

పళ్ళేసుకుని... నన్నంటాడా... నేనూ తిరిగంటే మొహం ఎక్కడ పెట్టుకుంటాడు? మానాన్నకున్నంత వయసు... మా యింటికి రెండిళ్ళవతల ఉండే సుధాకర్ అంకుల్. అతని పక్కన యింకొకతను నిలబడి నా వైపు నోరెళ్ళబట్టి చూస్తున్నాడు.

వూహ తెల్సిన క్షణం నుంచీ నా అసలు పేరుతో కాకుండా నన్నందరూ చీకటనో అమావాస్య అనో పిలిచి గేలి చేసినవాళ్ళే... కుర్రాళ్ళు ఏడ్పిస్తున్నారనుకుంటే... ముసలోడు వీడికేం పోయే కాలం వచ్చిందో....

విసురుగా వెళ్ళి అతని ముందు నిలబడ్డాను. బాధ కోపం, కసి, అన్నీ కలగలిసిపోయి బుసలు కొడ్తున్నట్లే శబ్దం బైటికొస్తూ "ఏమన్నావంకుల్.. మళ్ళా అను" అన్నాను.

నవ్వు మాయమై అయోమయంగా చూస్తూ "నేనేమన్లేదే" అన్నాడు.

"అమావాస్య అన్నావు. నేను విన్నాను. ఇంత వయసొచ్చి అబద్ధాలెందుకు చెప్తావు? నన్ను చూసే కదా అన్నావు" కోపంతో పెద్ద పెద్దగా అరిచాను.

అతని పక్కనున్నతను "రేపు అమావాస్య అని అన్నది నేనమ్మా. అందులో తప్పేం ఉంది? రేపు అమావాస్యేగా" అన్నాడు.

"మళ్ళా అదే మాట... చూస్తే పెద్దవారిలా ఉన్నారు. నాకు తెలీదనుకోకండి. నేను నల్లగా ఉన్నాననేగా అలా అన్నారు. మీకు నాలాంటి కూతురుంటే అలానే అంటారా? చదువూ సంస్కారం లేని వాడిలా ప్రవర్తించడానికి మీకు సిగ్గనిపించడం లేదా"



నా మాటలకు సుధాకర్ అంకుల్ మొహంలో కోపం కన్పించింది కాని అతని పక్కనున్న వ్యక్తిలో మాత్రం నేనూహించని ప్రశాంతత.. అతను చిర్నవ్వుతో నావైపు చూశాడు. "సుధాకర్ గారింట్లో ఓ శుభకార్యం జరగాల్సింది ఉందమ్మా. నేను పంచాంగం చూసి ముహూర్తాలు చెప్తాను కాబట్టి రేపు మంచి రోజా అని అడిగారు. అమావాస్య ఉందనీ, మంచిది కాదనీ చెప్తుండా నువ్వు కోపంతో రగిలిపోతూ వచ్చావు. చూడు తల్లీ. నేనసలు నీవైపు కూడా చూళ్లేదు. అయినా... చూసినా నువ్వు నల్లగా ఉన్నావని ఎగతాళెందుకు చేస్తాను తల్లీ.. నేను పూజించే కృష్ణుడు నల్లనయ్యేకదమ్మా అన్నాడు.

గొంట్లోకి లావాలా ఎగజిమ్ముతూ దుఃఖం... ఉబుకుతున్న కన్నీళ్ళను దాచుకుంటూ వేగంగా వెనుదిరిగి యింట్లోకి పరుగెత్తాను. ఏడిపించటం.. ఎదురు తిరిగితే ఏదో విధంగా సమర్ధించుకోవటం... ఛీ ఏం మనుషులో... గదిలోకెళ్ళి తలుపేసుకుని మంచం మీద పడుకోగానే తన్నుకుంటూ ఏడుపొచ్చింది. అలా ఎంత సేపు ఏడ్చానో తెలీదు. తలుపు కొడ్తున్న శబ్దానికి లేచి కుచున్నా. "అక్కా... తలుపు తీయవా?" ప్రియాంక గొంతు... నాకంటే రెండేళ్ళు చిన్నది. ఎంత బావుంటుందో... పాలలో వెన్నెలని రంగరించి దాన్లో కొద్దిగా తేనె చిలకరించి తయారుచేసినట్లు.. దేవుడెంత దుర్మార్గుడో... నన్నింత నల్లగా పుట్టించి దాన్నంత బంగారు చాయతో పుట్టించడమేమిటో.. కసి.. కోపం.. దేవుడి మీద.. అమ్మా నాన్నల మీద... ప్రియాంక మీద...

"ప్లీజ్ అక్కా... తలుపు తీ... లోపల నా పుస్తకాలున్నాయి. హోంవర్క్ చేయాలి. లేకపోతే టీచర్ కోప్పడతారు" ప్రియాంక బతిమాలుకుంటోంది. నాకు వినపడనట్టే దుప్పటి మెడదాకా లాక్కుని పక్కకు తిరిగి పడుకున్నాను. టీచర్ కోప్పడటమే కాదు దాన్ని తిట్టాలి.. కొట్టాలి.. అది బాగా ఏడ్వాలి. తెల్లగా ఉందని ఎంత పొగరో.. చిన్నప్పటి నుంచీ అది నా పక్కన ఉంటే ఎంత చిరాకో నాకు.. వళ్ళంతా కంపరం.. 'నీ చెల్లెలా.. ఎంత బావుందో... గులాబీ పూవులా ఉంది. మరి నువ్వేంటి అలా ఉన్నావు' అనో, 'మీ అమ్మానాన్నలు రంగుగానే ఉంటారే.. నీకెందుకా రంగు రాలేదో.. వాళ్ళకే పుట్టావా లేక ఎక్కడినుంచయినా తెచ్చుకుని పెంచుకున్నారా' అనో కాకుల్లా ఎంతమంది ఎన్నిసార్లు తన హృదయాన్ని పొడుచుకుతిన్నారో... హృదయమే మిగలనంతగా.. ఏముందని ఇపుడు? తనుపెంచి పోషించుకుంటున్న కసి తప్పు... మనుషులంటే ఏర్పడిన గడ్డ కట్టిన అసహ్యం తప్ప...

ప్రియాంక ఏడుపు సన్నగా విన్పిస్తోంది. 'తలుపు తీయమని అక్కతో చెప్పమ్మా' అంటోంది ఏడుస్తూనే. "దాని సంగతి తెలుసు కదా. ఆ గదిలో ఉండొద్దే అంటే విన్నావుకాదు" అమ్మ గొంతు. "పాపం అక్క.. ఒంటరిగా దాన్ని వదిలి ఎలా ఉండమంటావమ్మా. నేను దగ్గరుంటేనే కొద్దిగానైనా సరదాగా ఉండగలుగుతుంది" ప్రియాంక సమర్థింపు. "ఔన్లే.. నిన్ను కొట్టి తిట్టి ఏడ్పిస్తుంటే దానికి సరదాగానే ఉంటుంది. సరే.. నీ ఖర్మ.. అనుభవించు" అంటోందమ్మ.

నాకు వళ్ళు మండిపోయింది. నన్ను ఉద్ధరించడానికే నాతో పాటు గదిలో ఉంటున్నట్లు మాట్లాడుతోంది ప్రియాంక. నాకెవ్వరి దయాదాక్షిణ్యాలు అక్కరలేదు. విసురుగా లేచి దాని బట్టలు తీసి గుట్టగా కింద పడేశాను. తలుపు తీసి వాటిని కాలితో బైటకు నెట్టాను. దాని పుస్తకాలు తీసి వాటితో పాటు బైట పడేస్తూ "నువ్వు నాగదిలో ఉండక్కరలేదు. నువ్వుండటం నాకు సరదా కాదు.. నరకం.. నువ్వు పక్కనుంటేనే తేళ్ళూ జెర్రులూ పాకినట్టు కంపరం" అన్నాను.

అమ్మ ఏదో చెప్తుంటే వింటున్న నాన్న నా దగ్గరగా వచ్చి లాలనగా తల నిమరడానికి ప్రయత్నించాడు. విసురుగా తోసేశాను. గదిలోకి వెళ్తుంటే నాతోపాటే నాన్న లోపలికొచ్చి కుర్చీ మంచానికి దగ్గరగా లాక్కుని కూచున్నాడు. నేనదేమీ

పట్టించుకోకుండా "ప్రశాంతంగా బతకనివ్వరా నన్ను? మనశ్శాంతిగా ఉండనివ్వరా?" అంటూనే మంచం మీద అటువైపుకి తిరిగి పడుకున్నా. నాన్న ఏదో చెప్తాడని ఎదురుచూశా. చాలా సేపటి వరకు ఆయన నిశ్శబ్దంగా కూచున్నాడు. వెళ్ళి పోయాడేమోననుకుంటున్నంతలో నాన్న మృదువైన గొంతు విన్పించింది.



"ఎందుకు తల్లీ నిన్ను నువ్వు హింస పెట్టుకుని మమ్మల్ని కూడా హింస పెడ్తావు? ఓ మాట చెప్తాను వింటావా? నువ్వు బావుండవని ఎవరు చెప్పారు? ఆ ఆత్మ న్యూనత నుంచి బైట పడు. అన్నీ సర్దుకుంటాయి. మా నాయనమ్మ చామనచాయగా ఉండేది. అదే నీకూ వచ్చి ఉంటుంది. జీన్స్‌ని నిందించడం వల్ల ఏం ప్రయోజనం చెప్పు. నీ మోహం ఎంత కళగా ఉంటుందో ఎప్పుడైనా గమనించావా? ఒకప్పటి మేటి నటి వాణిశ్రీ మొహంలా... బిపాసా బసు కూడా చాయ తక్కువే గదా తల్లీ... బాహ్యంగా కన్పించేదే అందమని ఎందుకనుకుంటావు? దానికన్నా ముఖ్యం అంతః సౌందర్యం కదూ..."

నాన్న ఇంకేదో చెప్పబోతుంటే మధ్యలోనే అడ్డుకున్నా. "ఆపుతావా నీ ప్రవచనం? నేను చెప్పానా నా అందం గురించి బాధపడ్తున్నానని? ఈ ఇల్లే యమ కూపంలా ఉంది. ఈ బతుకు బతకటం కన్నా చావటం నయమనిపిస్తోంది. చూస్తూ ఉండండి. ఏదో రోజు ఆ పనే చేస్తాను" అన్నాను.

నాన్న ఏమీ మాట్లాడలేదు. బాధపడ్తున్నాడని మాత్రం అర్థమైంది. మరికొద్ది సేపు కూచుని బరువైన అడుగుల్తో బైటికెళ్ళిపోవడం అస్పష్టంగా విన్పించింది.

కాలేజీ ప్రాంగణంలో నడుస్తూ ఆధాట్టుగా తల తిప్పి చూశాను. బోగస్ విల్లియా చెట్టుకింద నిలబడి ఒకతను నావైపు చూస్తున్నాడు. మా కాలేజీ కుర్రాడు కాదు. వయసు ఇరవై రెండో ఇరవై ఐదో ఉండొచ్చు. మంచి ఎత్తున్నాడు. ఆకర్షణీయమైన మొహం.. లైట్ పింక్ కలర్ చొక్కాని బ్లాక్ కలర్ ప్యాంట్‌లో టక్ చేసి.. చప్పున చూపు తిప్పుకున్నాను. ఎంత నల్లగా ఉందో ఈ పిల్ల అనే చూపేనా అది? కానీ ఆ కళ్ళు తేట నీటి జలాశయాల్లా... కొద్దిగా నవ్వుతూ.. కొత్తరకం చూపు.. క్లాస్ రూంలోకెళ్ళగానే మర్చిపోయాను.

కాలేజి వదిలాక చూద్దును కదా అదే చెట్టుకింద నిలబడి మరలా అతనే... నా వైపు చూస్తూ..

వరుసగా నాలుగు రోజులు గమనించాను. అతను నాకోసమే అన్నట్లు నిలబడి ఉన్నాడు. అందమైన ఆడపిల్లలకు లైనేసే పద్ధతి కదా... మరి నాకోసం ఎందుకో... నేనందంగా ఉండనే.. కారణం వేరేదై ఉండొచ్చు.. ఉలకడూ పలకడు... వూరికే చూస్తాడు.. అంతే.

ఇహ లాభం లేదని కొద్దిగా వురుముతూ చూశానతని వైపు.... చల్లగా నవ్వాడు.. ఎంతందమైన నవ్వో.. అందుకేనేమో దారంతా వెన్నెల వరదలై పారింది. ముందుకు నడుస్తున్నా కాళ్ళకడ్డం పడుతూ అతని చూపు.. నా వెనకే నడుస్తూ అతను.. నడక వేగం తగ్గించాను... గుండె వేగంగా కొట్టుకోవటం తెలుస్తోంది. అతను నా పక్కనే నడుస్తూ... ఎంత బావుందో.. ఓ అందమైన యువకుడి పక్కన అడుగులో అడుగు కదుపుతూ నడుస్తుంటే...

"నా పేరు సందీప్... ఆంధ్రా యూనివర్శిటీ నుంచి యం.ఏ చేశాను. గోల్డ్ మెడలిస్ట్‌ని." అతని గొంతు మధురంగా ఉంది. మరికొంత మాట్లాడొచ్చుగా... మరీ అంత పొదుపా.. ప్లీజ్ మాట్లాడు.. వింటూ ఉండాలని ఉంది. రఫీ పాటలా హాయిగా.. తీయగా...

"మంచిది. నాకెందుకు చెప్తున్నారు?" తల తిప్పకుండానే అడిగాను.

"మీతో స్నేహం చెద్దామని"

ఆ మాట వినగానే అప్రయత్నంగా కాళ్ళు ఆగిపోయాయి. అతని వైపు కోపంగా, అనుమానంగా చూశాను... నన్ను హేళన చేస్తున్నాడా ఇతను? ఆట పట్టిస్తున్నాడా?

'ప్రాక్టికల్ జోకా? నేనే దొరికానా మీకు? నన్ను ఏడ్పించాలని కదూ" అన్నాను.

అతను బెదిరినట్టు కన్పించాడు. "అయ్యో... అలా ఎందుకనుకుంటున్నారు? నిజంగానే మీతో స్నేహం చేయాలని కోరిక... నిజం... తుమ్మెద రెక్కల్లా ఉన్న మీ కళ్ళ మీదొట్టు"

"నాతోనే ఎందుకు స్నేహం? ఈ కాలేజీలో చాలా అందమైన ఆడపిల్లలున్నారే...'

"మీరందంగా లేరని ఎవరన్నారు? నాకళ్ళతో చూడండి.. నాకు బాగానే ఉన్నారు"

"అపహాస్యమా?"

"కాదు. నిజం. మీలోని మంచితనం అదనపు ఆకర్షణ.. మంచితనాన్ని మించిన అందం లోకంలో ఎక్కడా ఉండదని నా నమ్మకం"

నాకు పెద్దగా నవ్వొచ్చింది. నేనా.. మంచిదాన్నా... ఇతని ఆంతర్యం ఏమిటో? ఏదో విషాన్ని లోపల పెట్టుకుని నాతో పరిచయం కోసం పాకులాడుతున్నాడా? ఏదో కుట్ర జరగబోతోందా?

"నేను మంచిదాన్నని ఎవరు చెప్పారు?"

"ఒకరు చెప్పాలా ఏమిటి? మిమ్మల్ని బాగా పరిశీలించాకే ఈ నిర్ణయానికొచ్చాను"

"చాలా పొరబడ్డారు. నేను మంచిదాన్ని కాదు"

"ఐనా పర్లేదు. మన స్నేహానికదేమీ అడ్డు రాదు"

"సారీ... నాకా ఉద్దేశం లేదు" అంటూనే వేగంగా నడిచి అతన్నుంచి దూరంగా వచ్చేశా.. కానీ అతని మాటల్ని, మృదుమధురమైన కంఠస్వరాన్ని, అతను నా పక్కగా నడుస్తున్నప్పుడు కలిగిన తీయటి అనుభూతిని నాతోపాటే తెచ్చుకున్నా. రాత్రి నిద్ర పడితే ఒట్టు.. ఎంత చక్కగా ఉన్నాడో.. స్నేహమనేగా అన్నాడు.. ప్రేమనలేదుగా.. అందంగా లేకపోవటం ప్రేమకు డిస్ క్వాలిఫికేషనైతే కావొచ్చేమో కాని స్నేహానికి కాదుగా.. ఎందుకలా కర్కశంగా తిరస్కరించి వచ్చేశాను? ఎంత బాధపడ్డాడో.. రేపటి నుంచి కన్పించడనుకుంటా.. ఏమనుకుని ఉంటాడో... నల్లగా అందవిహీనంగా ఉన్నా ఈ పిల్లకెంత పొగరో అనుకుంటాడా? ఎంత గొప్ప అవకాశం చేజార్చుకున్నానో.. సినిమాల్లో హీరోలా ఉన్నాడు చూట్టానికి.. కోరి కోరి దగ్గరకొస్తే మూర్ఖంగా గిరాటేశాను. పొరపాటైంది.. ప్లీజ్ ప్లీజ్.. మరొక్క అవకాశం ఇయ్యవా? ఒక్కటంటే ఒక్కటి చాలు... ప్లీజ్... అని ఏ వందసార్లు అనుకుని ఉంటానో...



ఉదయం కాలేజీకెళ్ళినప్పుడు ఆ చెట్టుకింద వెదికాను. లేదు. సముద్రమంత నిరాశ నన్ను ముంచెత్తింది. పాఠాలు విన్లేదు... దుఃఖమేదో రక్తం బదులు నరాల్లో ప్రవహిస్తున్న భావన... కాలేజీ వదిలాక నీరసంగా బస్టాప్ వైపుకు నడుస్తున్నాను. నాపక్కన నడుస్తూ అతను... గుండె లయ తప్పింది. తల తిప్పి చూళ్ళేదు కానీ అతనేనని తప్పకుండా చెప్పగలను.

"ఎక్కడైనా కూచుని ప్రశాంతంగా కొద్దిసేపు మాట్లాడుకుందామా?" అన్నాడతను.

"నిన్ననే చెప్పాగా నాకు ఏ రకమైన ఆసక్తి లేదని" బింకం సడలకూడదని చెప్పానుగాని అతని ఓటమి అంగీకరించకుండా మరికొంత వెంటబడితే బావుండునన్న భావన...

"మీరు మంచివారు కాదని చెప్పారుగా.. ఎంత వరకు నిజమో తెల్సుకుందామన్న ఆసక్తి.. మీలో మంచితనం లేదని నన్ను కన్విన్స్ చేయండి. ఇక మీ జోలికి రాను. నాకసలే చెడ్డవారంటే బోల్డంత భయం" అన్నాడతను.

"సరే పదండి. ఎక్కడ కూచుందాం?"

"మీకభ్యంతరం లేకపోతే ఈ పక్కనే ఉన్న పార్కులో"

పార్కులో పూపొదల చాటున అతనికి సమీపంగా కూచుంటే ఇన్నాళ్ళూ నన్ను దాటుకుని వెళ్ళిపోయిన వసంతం తిరిగొచ్చి ఆత్మీయంగా అల్లుకున్నట్లు...

ఎందుకోగాని అతని దగ్గర నిజాలు దాచాలనిపించలేదు. నా చెల్లి మీద నాకున్న కసి, దాన్ని ఎన్ని రకాలుగా ఏడ్పించి సంతోషపడేదీ, మా అమ్మానాన్నల్ని బాధపెట్టిన సంఘటనలు, సమాజం మీద నాకున్న ఏవగింపు.. అన్నీ చెప్పాను.

"ఇప్పటికైనా ఒప్పుకుంటారా నేనెంత పెద్ద శాడిస్టునో" అంటూ నవ్వాను.

"ఒప్పుకోను" అన్నాడతను. ఆశ్చర్యంగా చూశానతని వైపు... ఇంత చెప్పినా అర్థం చేసుకోలేని మూర్ఖుడా? కాదే.. మొహం ఎంత తేజోవంతంగా ఉందో... తెలివంతా కుప్పగా పోసినట్టు వెలుగు...

"మీ నవ్వు... బాధ కలబోసుకున్న నవ్వు.. కన్నీళ్ళ కెరటాల్ని కనురెప్పల వెనుక దాచుకుని పెదాల పరదాలుగా చేసి ఏమార్చే నవ్వు.. మీరలా ప్రవర్తిస్తున్నందుకు లోపల ఎంతగా కుమిలిపోతుంటారో నాకు తెలుసు. మీరు స్వతహాగా చాలా మంచివారు. మీ బేసిక్ నేచర్ అదే. ఇవన్నీ బాహ్య కారణాల వల్ల తాత్కాలికంగా ఏర్పడిన మానసిక వైకల్యాలు. వాటినాధారంగా చేసుకుని మిమ్మల్ని అంచనా వేయడం సరికాదు. మీ లోపలి మనిషిని చూడాలి. నాకు పూర్తి నమ్మకముంది మీరు మంచివారు. అందుకే మీ స్నేహం కావాలని ఆరాటపడ్తున్నాను. కాదనకండి ప్లీజ్" అన్నాడు.

నేనక్కడ లేను... ఎక్కడో నీలినీలి ఆకాశంలో... దూదిపింజలా తేలిపోతున్న మేఘాల మేనా మీద... తారల తనూలతల మెరుపుల్లో నా ప్రతిబింబం చూసుకుంటూ... నా చేయి పట్టుకుని.. సందీప్.. కాంతితో మెరిసే అతని కళ్ళు.. దయతో పలికే నోరు..

రోజూ సాయంత్రాలు కాలేజి వదిలాక సందీప్‌తో షికార్లు.. ఎంత బాగా మాట్లాడతాడనీ... గుండెలోతుల్లోకి తొంగి చూసి మనుషుల్ని అర్థం చేసుకోవడం ఎంత బాగా చేతనవుతుందో.. మాటల మాంత్రికుడు..ముళ్ళ పొదల్ని సుమలతలుగా మార్చగల నేర్పరి... నాలోనూ ఎంత మార్పో...

ఆ రోజు సరస్సులో కదలాడుతున్న అలలతాంగుల్ని చూస్తూ "నువ్వు అందంగా ఉంటావు తెలుసా" అన్నాడు.

"నేనా.. జోకులొద్దు.. బీ ప్రాక్టికల్" అన్నాను చిరుకోపంగా.

"నేను అబద్ధాలు చెప్పనని నీకు తెల్సుగా.. నిజం..."

"మళ్ళా అదే మాట? మంచిదాన్నని మీరనుకుంటుంటే ఏదో పోనీలే ముచ్చటపడ్తున్నారని వదిలేశా... అందం ప్రస్తావన తీసుకురావద్దు. నేను బాధపడ్తాను"

"అదే తప్పు.. మంచితనాన్ని మించిన అందం ఏముంటుంది? నువ్వు నా కళ్ళకి యింతకు ముందుకన్నా మరింత అందంగా కన్పిస్తున్నావు. ప్రామిస్" అన్నాడు.

యింట్లో ఉన్నంతసేపూ అతని మాటలు ఎన్నెన్ని సార్లు గుర్తుకు వచ్చి గిలిగింతలు పెడ్తాయో.. ప్రియాంక నాకళ్ళకు అందంగా కన్పిస్తుందిప్పుడు. నా హృదయానికి చేరువగా కూడా.. మొదటిసారి దాని వైపు చూసి ప్రేమగా నవ్వినపుడు అది కంగారు పడింది. పిచ్చో దెయ్యమో పట్టి ఉంటుందనుకుందట.. తర్వాత చెప్పింది. దాన్ని దగ్గరకు తీసుకుని 'ఇన్నాళ్ళూ నిన్ను ఎలా



మిస్సయ్యానో చెల్లీ.. నిన్ను బాధ పెట్టాను కదూ.. నన్ను క్షమించవూ' అన్నప్పుడు అది ఉద్వేగాన్ని తట్టుకోలేక ఏడ్చేసింది. బైటికి పరుగెత్తి అమ్మతో 'అక్క మారిపోయిందమ్మా.. అక్క చాలా మంచిదమ్మా' అంటుంటే నాకూ కన్నీళ్ళు ఆగలేదు.

అమ్మా నాన్నా నాకళ్ళకు దేవతల్లా కన్పిస్తున్నారు. 'మీ కూతురిగా పుట్టటం నేను చేసుకున్న అదృష్టం నాన్నా. మీరూ అమ్మా నా వల్ల ఎంత దుఃఖపడిఉంటారో.. నేనెక్కడ పొరబడ్డానో ఇప్పుడు తెలుస్తుందమ్మా. ఇంకెప్పుడూ అటువంటి తప్పు చేయను' అన్నప్పుడు నాన్న కళ్ళలో మెరిసిన తడి.

ఇల్లిప్పుడు స్వర్గంలా ఉంది. అమ్మా నాన్నా చెల్లీ.. అందమైన ప్రేమ కుటీరంలా ఇల్లు.. ఇన్నాళ్ళూ ఎన్ని అనుభూతుల్ని మిస్సయ్యానో.. అద్దంలో చూసుకుంటే నా మొహం ఒకప్పటిలా అసహ్యంగా కన్పిచడం లేదు. నిజంగానే నాకళ్ళు నల్లటి తుమ్మెద రెక్కల్లా ఎంత బావున్నాయో.. పెదవులు కూడా పొందిగ్గా.. చుంబుకం వి ఆకారంలో.. ఇన్నేళ్ళూ కళ్ళెలా మూసుకుపోయాయో.. రంగు గురించి తప్ప మరో ఆలోచన లేనంత గుడ్డిగా... రంగు కూడా మరీ నలుపు కాదే.. చామన చాయ.. అంతే. నాన్న ఇదే మాట చెప్పినపుడు కలగని జ్ఞానం సందీప్ మాటల వల్ల కలిగింది.

గుండె లోతుల్లో ఏదో వెలుగు.. అది కళ్ళల్లో పరావర్తనం చెంది మొహాన్నంతా వెలిగిస్తోంది... నేను మరీ అనాకారిని కాను... అందగత్తెని కాదు గానీ పర్లేదు బాగానే ఉంటానన్న భావన బలపడ్తూ..

సందీప్‌తో ఈ విషయం చెప్పినపుడు "నిన్ను నువ్వు ప్రేమించుకోవడం మొదలెట్టావు. అందుకే మిగతావాళ్ళనీ ప్రేమించగలుగుతున్నావు" అన్నాడు. నాకతని మాటలు అర్థం కాకున్నా నాలో వచ్చిన మార్పుకి సంతోషపడ్తున్నాడన్న విషయం అర్థమైంది.

ఓరోజు కాఫీడేలో కబుర్లు కలబోసుకుంటున్నప్పుడు హఠాత్తుగా "అందరూ వెన్నెలా వెలుతురూ అంటూ వెంటపడ్తారు కానీ చీకటీ బావుంటుంది తెలుసా" అన్నాడు.

"నల్లటి పరదాల రెపరెపల్లా ప్రవహించే చీకటి.. అందమైన కళ్ళకు కాటుక అద్దినట్టు.. చీకటే లేకపోతే ఉదయాలు అద్భుతంగా ఉంటాయా చెప్పు? చీకటి గర్భంలోనేగా ఉదయాలు ప్రాణం పోసుకుంటూ ఉంటాయి. దేని అందం దానిదే.. అందాన్ని వెదికి ఒడిసి పట్టుకోవడమూ కళే.. అది తెలిస్తే ప్రకృతిలో ప్రతిదీ అందంగానే కన్పిస్తుంది" అన్నాడు.

ఆ కళ అతనిలో పుష్కలంగా ఉంది. నన్ను శిల్పంగా మలవలేదూ... నల్లరాతిలో చెక్కిన అద్భుతమైన శిల్పం... నాకు తెలియకుండానే అతన్ని ప్రేమించడం మొదలెట్టాను. అతను మాట్లాడుతుంటే మంత్ర ముగ్ధలా వినడం.. అతను నవ్వినపుడు అందంగా విచ్చుకునే పెదవుల్ని కన్నార్పకుండా చూస్తూ ఉండడం.. అతని ఆలోచనల్తో క్షణాల్లోని ప్రతి కణాన్ని నింపేయడం...

సందీప్‌తో ఈ విషయం చెప్పాలని ఆరాటం.. పార్కులో నాకోసం ఎదురుచూస్తూ సందీప్..

"నీకో ముఖ్యమైన విషయం చెప్పాలని కాచుకు కూచున్నాను" అన్నాడు నేను పక్కన కూచోగానే...

"నేనూ నీకో ముఖ్యమైన విషయం చెప్పాలని పరుగెత్తుకుంటూ వచ్చాను" అన్నాను.

"సరే... మొదట నువ్వే చెప్పు"

"సందీప్... ఐ థింక్ ఐ యాం ఇన్ లవ్ విత్ యూ" అన్నాను.

"ఇలాంటిదేదో ఉంటుందని నేనూహించాను. కానీ ఎప్పుడైనా నేను పొరపాటునైనా అటువంటి అభిప్రాయం కలిగేలా ప్రవర్తించానా?"

"లేదు. కాని నేనే..."

"నేను చెప్పాలనుకున్న విషయమేంటో మొదటవిను. నా యం.ఏ సబ్జెక్ట్ సైకాలజీ.. అది ఐపోయాక రీసెర్చిలో చేరాను. నా టాపిక్ ఏంటో తెలుసా? ఎదుటి వ్యక్తిని ప్రేమించాలంటే మొదట మనల్ని మనం ప్రేమించుకోవటం నేర్చుకోవాలి అనేదే టాపిక్. నా పరిశోధనకు గాను నేను నిన్ను ఎంచుకున్నాను. నా పరిశోధన సఫలీకృతమైంది. థీసిస్ రాయడం పూర్తయింది. యూనివర్శిటీలో సబ్మిట్ చేయడానికెళ్తున్నాను. నీకు చెప్పి వెళ్ళడానికే ఆగాను. నేను మొదట్నుంచీ మనం స్నేహితులమని చెప్పాను తప్ప ప్రేమ ప్రస్తావన ఎప్పుడూ తీసుకురాలేదు. ఒక వేళ పొరపాటున అటువంటి అభిప్రాయాన్ని కలుగచేస్తే నన్ను క్షమించు. ఏది ఏమైనా నా రీసెర్చికి దోహపడినందుకు థ్యాంక్స్. నిన్నప్పటికీ మర్చిపోను" అన్నాడు.

నవ్వుతూ తుళ్ళుతూ జారిపోతున్న క్షణాల్ని ఆస్వాదిస్తున్న తరుణంలో గుండెల్లో బుల్లెట్ దిగబడితే కలిగే బాధలాంటి బాధ... ఒక్కసారిగా రక్తంలోకి దుఃఖాన్ని ఎవరో కుమ్మరించినట్లు...

రోజుల తరబడి విడవని నిరాశ... మెల్లగా బైట పడటానికి ప్రయత్నిస్తున్నాను. సందీప్ మీద నాకిపుడు కోపం లేదు. అతని మీద ఆశలు పెంచుకోవడం నా తప్పు. మంచితనం కూడా ఓ వ్యసనమే... అది అలవాటైనాక దాన్నుంచి బైట పడాలన్నా పడలేని పరిస్థితి. సందీప్ లాంటి వ్యక్తితో స్నేహం.. అది కొన్ని నెలలే ఐనా.. ఓ అందమైన అనుభవం.. తీయనైనా అనుభూతి.. నా జీవితంలోకి ప్రసరించిన వెల్తురు కిరణం...

సందీప్ తన రీసెర్చి కోసమే నాతో స్నేహం చేశాడని తెల్సిన వెంటనే కళ్ళముందంతా చీకటి పర్చుకుంది. కాని సందీప్‌తో పరిచయం నాకు కొత్త పాఠాల్ని నేర్పింది. నేను నిరాశలో కూరుకుపోలేదు. నాకు నమ్మకముంది. చీకటి చివర్లో తప్పకుండా వెల్తురుంటుంది...



# కవిత

## విగత ప్రశ్న

- జంధ్యాల రఘుబాబు
9849753298

ఎవరికి తెలుసు
ఉన్నట్టుండి
ఉరుము ఉరిమినట్టు
మెరుపు మెరిసినట్టు

ముష్కరుడు చూపిన
మృత్యు రూపం
ఎలాగుందో చూసేసరికి
కళ్ళు బైర్లు కమ్మి
కర్ణభేరి అదిరిపడి

జీవం విడివడి
రూపం రూపాంతరం చెంది
పంచభూతాలూ ఒకేసారి
ఆలింగనం చేసుకున్నట్టు

మనసూ శరీరం
ఏదో ఆలోచించాలని
ఎందరో కదలాలని
చేసే ప్రయత్నాలు
నవ్వు తెప్పిస్తున్నాయ్
ఏడుపు రాకనే వస్తోంది

జీవనాడులు ఇక
శాశ్వత నిద్రకు
సమాయత్తమవుతున్నట్టు




తెలుస్తూనే ఉంది
నాకే ఎందుకీ దుస్థితి
రక్తపు ముద్దలా
పిల్లాడిని చేసి హతమార్చారన్న
అభిమన్యుడి మనోవేదనలా
తొడలు విరిగిపడ్డ సుయోధునుడిలా
దగా పడి నేలకొరిగిన అంగరాజులా

కదలలేక పలుకురాక
దూరాలు దగ్గరవుతున్నట్టు
అందరికీ దూరమవుతున్నట్టు

అదిగో బతుకు జీవుడా అని
అటూ ఇటూ పరుగిడే జనాలు
వారు క్షేమంగా ఉండాలని
నా కొన ఊపిరి కోరిక
అది గాలిలో కలిసిపోకూడదు
ఆ తరువాత ఏమీ తెలియదు
విగత జీవుల జాబితాలో
కొవ్వొత్తుల కాంతుల్లో
జిగేల్‌మంటూ నా చిత్రం
దాని కింద గుండ్రని అక్షరాల్లో
నా పేరు
మరణించానని నా పేర
పత్రం ఇస్తారు
ప్రాణం ఎలాపోయిందో
చెబుతారు కావలిస్తే
ఎవరివల్ల ఈ అమానుషం
ఎందువల్ల ఈ దుస్థితి
అన్న నా చివరి ప్రశ్నకు మాత్రం
సమాధానం లభించదు !

---

## "ధిక్కా" రమై

- కె. విల్సన్‌రావు
8985435515

ఓటు కార్డుంది - కోటా కార్డుంది
ఆరోగ్యశ్రీ కార్డుంది - నిన్న మొన్నొచ్చిన
ఆధార్ కార్డూ ఉంది ...

ఏం లాభం !?
అన్నిట్లోనూ నా బొమ్మ
అలికినట్లే వుంది - గుర్తించలేనంతగా
గవర్నమెంటోళ్ళు తీయించింది కదా !
ఎవరి మామూళ్ళు వాళ్ళకు ముట్టాలిమరి !

ఎక్కని గుమ్మం లేదు - దిగని గుమ్మం లేదు
పందికొక్కులు బరితెగించి బజారున పడ్డాయ్
నాముఖాన్ని అచ్చు నాముఖంలాగే ముద్రించటానికి
కాస్త అటూ ఇటూగానైనా...

ఇక తప్పదు




అనివార్యంగానైన
నన్ను నేను వెతుక్కుంటూ
నన్ను నేను కనిపెట్టుకుంటూ
అనేక ముఖాలుగా విస్తరించుకుంటూ
నమ్మకాన్నిచ్చే సమాజం కోసం
మహనీయులు వేసిన బాటల్లో
శివమెత్తి, అన్యాయాన్నెదిరించే
ధిక్కార స్వరమై, నిత్యం శవాలుగ
బతుకుతున్న జాతికి దిక్కవ్వాలి....
జాగ్రేరహో జనులారా !
నోరు విప్పండి !!
మదతపడిన నాల్కల్ని సరిచేయండి !!!
కాలిబాటల్లో ముళ్ళ కుప్పల్ని తొలగిస్తూ
కాంతి దీపాల్ని వెలిగిస్తూ ముందుకు సాగుదాం-
నూతన మానవావిష్కరణ శిల్పులతో
మనమూ కంఠం కలిపి కొత్త పొద్దుల్ని ఆహ్వానిద్దాం.

మరోసారి రాచకొండ విశ్వనాధశాస్త్రి

# పిపీలికం - వేతన శర్మ కథలు

- దివికుమార్
9440167891



**రావిశాస్త్రి అరుదైన కథకుడు. అద్భుత రచయిత. అయస్కాంత శక్తిలాంటి శైలితో ఎవరినైనా తనవైపు గుంజేసుకునేంత శక్తిమంతుడు. మన మందరం ఎరిగిన సరళమైన జీవిత సత్యాన్ని, ప్రకృతి ధర్మాన్నీ తన ప్రత్యేకమైన శైలిలో కథలుగా మలిచి తిరిగి అందర్నీ మెప్పించగలదిట్ట. తెలుగునాట ఉద్యమాలతో తాను ఉత్సాహపడి తెలుగువారిని తన రచనల ద్వారా ఉత్తేజపరిచిన కథకుల్లో ఆయన మొదటి శ్రేణికి చెందినవారు.**

"బలవంతుడ నాకేమని
పలువురతో నిగ్రహించి పలుకుటమేలా
బలవంతమైన సర్పము
చలిచీమల చేతచిక్కి చావదె సుమతీ !!"

చిన్ననాడు సుమతీ శతకం చదువుకున్న వారిలో ఎక్కువ మందికి తప్పక జ్ఞాపకం వుండే పద్యాల్లో యిదొక్కటి.

రావిశాస్త్రి అరుదైన కథకుడు. అద్భుత రచయిత. అయస్కాంత శక్తిలాంటి శైలితో ఎవరినైనా తనవైపు గుంజేసుకునేంత శక్తిమంతుడు. మన మందరం ఎరిగిన సరళమైన జీవిత సత్యాన్ని, ప్రకృతి ధర్మాన్నీ తన ప్రత్యేకమైన శైలిలో కథలుగా మలిచి తిరిగి అందర్నీ మెప్పించగలదిట్ట. తెలుగునాట ఉద్యమాలతో తాను ఉత్సాహపడి తెలుగువారిని తన రచనల ద్వారా ఉత్తేజపరిచిన కథకుల్లో ఆయన మొదటి శ్రేణికి చెందినవారు. వారికి బాగా పేరొచ్చిన కథల్లో పిపీలికం ఒకటి.

మహా ఘనత వహించిన భారతీయ తాత్త్వికతలోని జీవాత్మా - పరమాత్మల మీమాంసగానీ, మట్టీ-కుండా తర్కంగానీ రజ్జు సర్పభ్రాంతి గానీ జన్మరాహిత్య మోక్షంగానీ 'వర్గ' దృక్పథానికీ వర్ణ వ్యవస్థకూ లోబడినవేనని 'పిపీలికం' కథ ద్వారా కొందరైనా గ్రహిస్తారు. కష్టజీవులైన కూలి చీమల్లాంటి ప్రజలంతా చదువులకు దూరం చేయబడిన శ్రామిక కులాల్లాంటి వారేనని ఆరంభం నుండి చివరికంటా పాఠకుడి బుద్ధికి పొరిపిడి పెడుతూనే వుంటుందీ కథ.

'జగతేది జవమేది? తనువులో తానేది?" అనే చిట్టి చీమ అంతర్మథనానికి 'శ్రమే మూలము, మానవ శ్రమే జీవము' అనే జవాబుని మనం పొందేదాకా మనల్ని వీడదీ కథ.

ఎంతో మంది జ్ఞానులూ మహర్షులూ బోధించని జీవిత సత్యాన్ని పిపీలకానికి కాలసర్పం నేర్పింది, కష్టజీవుల శ్రమా నైపుణ్యమే ధనరాసుల పుట్టలవుతాయని! నేడు అనంత పద్మనాభస్వామి దేవాలయపు 6వ నేలమాళిగలోని కష్టజీవుల శ్రమ ఫలితమైన ధనరాసులనుకైంకర్యం చేయటానికి నాగబంధాల బూచినీ, సర్పభ్రాంతుల్నీ అడ్డం పెట్టుకోవడం మనకు నడుస్తున్న చరిత్ర. 'పిపీలికం' కథా కాలం నాడు ప్రపంచంలో అనేక దేశాలనే పుట్టల్ని దురాక్రమిస్తూ వచ్చిన అమెరికా సామ్రాజ్యవాద ప్రభువులు వియత్నాం ప్రజల వీరోచిత ప్రతిఘటన నెదుర్కొంటున్నారు. అక్కడ నుండి పారిపోవాల్సి వచ్చినా నేటికీ పుట్టల దురాక్రమణను వాడుకొనసాగిస్తూనే వున్నాడు. కొత్త రూపాల్లో అణ్వాయుధ కోరలతో దురాక్రమణ దౌష్ట్యాలూ, యుద్ధాలూ చేస్తూనే వున్నాడు. ఈ భూభారం తగ్గాలంటే మన పల్లెల నుండి ప్రపంచం దాకా పెనవేసుకుని వున్న ఈ మూడు పడగల విష సర్పంతో "మేం కష్టజీవులమే కావచ్చు. నువ్వు సుఖభోగివే కావచ్చు. కానీ నువ్వు మా కష్టాన్ని అపహరించి మాకు అన్యాయం చెయ్యడం మేం సహించం ! మేం తిరగబడతాం. నువ్వు చెప్పిన న్యాయం భగవన్న్యాయమైనా సరే అది అన్యాయం కాబట్టి దాన్ని మేం మారుస్తాం! అందుగురించి మేం తిరగబడతాం. మీ మీద మేం తిరగబడి తీరుతాం" అని మళ్ళీ మళ్ళీ అనక తప్పదు. అప్పుడే కారడవి (శ్యామవనం) లాంటి ఈ దోపిడీ ప్రపంచంలో వెలుగులు విరజిమ్ముతాయి.

'పిపీలికం' అంటే చిన్న చీమ. తమ ఆహార సేకరణకు, తమ కంటూ ఒక గూటిని ఏర్పాటు చేసుకోవటానికి



అలసట లేదా అన్నట్టు అవి ఎంత శ్రమ పడతాయో మనకు తెలుసు. కష్టజీవికే కాదు క్రమశిక్షణకు, ఐక్యతకు తిరుగుబాటుకు కూడా చిరుచీమలు గొప్ప ప్రతీకలు. తన బరువంత బరువు మోయటం మనిషికి చాలా కష్టం గానీ, చిట్టి చీమ తనకంటె 18 రెట్లు ఎక్కువ బరువును మోస్తుందట! (చీమ తలకాయంత నద్బుద్ధి మానవులందరికీ వుంటే ఎంత బావుణ్ణు!)

రావిశాస్త్రి పిపీలికం కథాకాలం 1969 జనవరి. అప్పటి ఆంధ్రప్రదేశ్ అట్టుడిగిపోతోంది. శ్రీకాకుళంలో గిరిజనుల తిరుగుబాటు ఈ కథకి నేపథ్యంగా వుంది. ప్రకృతి సహజాతాన్ని, అందులో భాగంగా మానవ సహజాతమైన తిరుగుబాటుని రావిశాస్త్రి ప్రతీకగా తీసుకుని, శ్రీకాకుళం తిరుగుబాటును సమర్థిస్తూ ఈ కథ రాశారు. ఒక ప్రకృతి సహజమైన సాధారణాంశాన్ని, శ్రీకాకుళమనే ప్రత్యేక సందర్భానికి అన్వయించి ఈ కథ రాశారు. శ్రమ జీవుల పాలిట దుష్టశక్తులకి ప్రతీకగా రాక్షసాకారం లాంటి బుసబుసల సర్పాన్ని మనముందు నిలబెట్టారు. ఎందరో వేదాంతులనబడే వారు తీర్చలేని ఒక సందేహాన్ని – చిట్టి చీమలంటే కష్టజీవులన్న సత్యాన్ని – ఈ విషప్పురుగే స్పష్టంగా చెప్పింది.

ప్రతీకలూ, ఉపమానాలతో కూడిన కథలనీ, కవిత్వాలనూ, అర్థం చేసుకుని అన్వయించుకోవటంలో కొన్ని సమస్యలున్నాయి. ముఖ్యంగా భావాలు భౌతికరూపం ధరించేటప్పుడు, అనగా సిద్ధాంతాలు ఉద్యమాలుగా రూపొందేటప్పుడు అవి తక్షణ ఆచరణకు దోహదపడిన మేరకు ప్రతీకలతో రూపొందే భావాలు సత్ఫలితాలకే కాక దుష్ఫలితాలకు కూడా కారణమవుతాయి. అందునా రచయిత లేక రచన గొప్ప ప్రతిభతో కూడినవయినపుడు, ఆ రచనలోని చిన్న అవగాహనా సమస్య కూడా తీవ్ర దుష్ఫలితాలకు దారితీసే ప్రమాదముంటుంది.

ఈ పిపీలికం కథలోని చిట్టిచీమలూ, రాక్షసాకారం గల సర్పమూ – ఈ రెండూ రెండు రకాల ప్రకృతి సిద్ధ జీవులు. వాటికి మానవ చైతన్యాలుండవు. జీవపరిణామ సిద్ధాంత కర్త ఛార్లెస్ డార్విన్ చెప్పింది 'సర్వైవల్ ఆఫ్ ది ఫిటెస్ట్' (బలంగల జీవిదే బతుకు) సూత్రం వాటికి వర్తిస్తుంది. దాన్ని నిరాకరిస్తూ వచ్చిన మానవ చైతన్యపు వ్యక్తీకరణే "బలవంతుడు నాకేమని" పద్యం. ప్రకృతి సహజ స్పృహ మాత్రమే గల చీమలు కూడా ఒక్కసారిగా తిరగబడి గెలుస్తున్నాయనీ ఉన్నత చైతన్యం గల మానవుల చేతుల్లో వారి సంఘటిత శక్తి ముందు బలవంతులమని విర్రవీగే వారు ఓటమిపాలు కాక తప్పదనీ ఈ పద్యం చెబుతోంది.

"కష్టజీవులు కష్టపడాలి. సుఖభోగులు సుఖించాలి. అలా జరుగుతుందనేది ప్రకృతి ధర్మం. అలా జరగాలనేది భగవదాదేశం" అంటుందీ కథలో నాగుబాము. ఈ "సోషల్ డార్వినిజాన్ని" దోపిడీ వర్గాలు నాటి నుండి నేటి దాకా ప్రబోధిస్తున్నాయి. ఆర్థిక, రాజకీయాధిపత్యంతో క్రూరమారణాయుధాలతో, వినూత్న అణచివేతల పద్ధతులతో, కష్టజీవుల్ని చీలికలు పీలికలు గావించగల 'తునకల సిద్ధాంతా'లతో (థియరీ ఆఫ్ ఫ్రాంగ్మెంటేషన్) దోపిడీ శక్తులు కూడా రోజు రోజుకీ క్రూర 'చైతన్యా'లను పొందుతున్నాయి. వియత్నాంలో ఓటమికి గురయిన బుద్ధి తెచ్చుకోలేని అమెరికా సామ్రాజ్యవాదం, సోషల్ డార్విజాన్నే నమ్ముకుని మానవ వినాశనానికి ఇంకా... ఇంకా కారణమవుతోంది.

**ఈ కథ వెలువడిన నాటికి (1969 జనవరి) సరిగ్గా 20 ఏళ్ళ వయసులోకి అడుగుపెట్టిన నాలాంటి వారికి 'ఖతం' కార్యక్రమాన్ని అమితోత్సాహతో అమలు జరిపిన ఆనాటి శ్రీకాకుళ పోరాట ప్రభావం ప్రబలంగా వుండేదని గుర్తుంచుకుంటే ఇలాంటి కథలకు ఆచరణాత్మక అర్థాలు చెప్పటంలోనూ, అన్వయించుకోవటంలోనూ ప్రజా ఉద్యమ చైతన్యం నిర్వహించే ఆచరణాత్మక పాత్ర చాలా వుంటుందని గ్రహించాలి ఒక తరాన్నే ఈ దృక్పథం పక్కదారి పట్టించగలిగింది.**

ఇలాంటి కథల్లోని ప్రతీకల్ని, ప్రకృతి సహజలక్షణాలను సామాజిక వర్గ స్వభావాలకు, ఉద్యమాలకు అన్వయించేటప్పుడు చాలా సున్నిత సమస్యలొస్తాయి. పాముకంటే కూడా దుష్టమానవుడు (ఖలునకు నిలువెల్ల విషము) ఎక్కువ ప్రమాదకారుడన్నారంటే.. మనం దుష్టడనుకున్న వారినల్లా కొట్టి, నరికి, కాల్చి, చంపేయాలనే అర్థం తీసుకుంటే అది సామాజిక అవగాహనా సమస్యే! మానవ సమాజంలోని బహుముఖ స్వభావాలను గుణాలను అర్థం చేసుకోవటం వరకే దాన్ని పరిమితం చేయాలి. ఆ స్వభావాలతో వ్యవహరించేటప్పుడు ప్రకృతి సిద్ధ జీవ చైతన్యంతో కాక మానవ సమాజం వేల సంవత్సరాలుగా అభివృద్ధి పరుచుకున్న సామాజిక చైతన్యంతో పరిణతితో వ్యవహరించాలి. అలా కాకుండా ఈ కథలోని రాక్షసాకార సర్పాన్ని మన సమకాలీన సామాజిక 'వర్గ శత్రువు'లకు (భూస్వామ్య – బూర్జువా – సామ్రాజ్యవాదులకూ, అవినీతి – నిరంకుశ అధికార్లకూ) అన్వయిస్తే కథలో చీమలు పామును చంపినట్టు వర్గ శత్రువులను భౌతికంగా 'ఖతం' చేయటంగా అది మారిపోతుంది. ప్రజా ఉద్యమ నిర్మాణపరమైన వివిధ దొంతరల కృషికి బదులు 'ఖతం' అనే ఏకైక పోరాటరూపం కొరకే పనిచేయాలన్నట్టు ఈ భావం మార్చేయగలుగుతుంది.

ఈ కథ వెలువడిన నాటికి (1969 జనవరి) సరిగ్గా

20 ఏళ్ళ వయసులోకి అడుగుపెట్టిన నాలాంటి వారికి 'ఖతం' కార్యక్రమాన్ని అమితోత్సాహతో అమలు జరిపిన ఆనాటి శ్రీకాకుళ పోరాట ప్రభావం ప్రబలంగా వుండేదని గుర్తుంచుకుంటే ఇలాంటి కథలకు ఆచరణాత్మక అర్థాలు చెప్పటంలోనూ, అన్వయించుకోవటంలోనూ ప్రజా ఉద్యమ చైతన్యం నిర్వహించే ఆచరణాత్మక పాత్ర చాలా వుంటుందని గ్రహించాలి ఒక తరాన్నే ఈ దృక్పథం పక్కదారి పట్టించగలిగింది. ఇది చూడండి. "శ్యామవనంలో మర్రిచెట్టు కింద ఆ దినం ఓ రాక్షసాకారం విలవిలాతన్నుకుని నెత్తురు కక్కుకుని చచ్చిందట. ఆ మేరకి ఆ మూలంగా భూభారం కొంత తగ్గిందట" అనే ఈ కథా ముగింపు వాక్యాలు ఎలాంటి అర్థాన్నిస్తాయి? వ్యవస్థకూ దాన్ని కాపాడే వర్గాలకూ, రాజ్యానికీ వ్యతిరేకంగా కాకుండా వర్గ సంఘర్షణను వ్యక్తులకు అన్వయించుకుని వర్గశత్రువుని భౌతికంగా నిర్మూలించటమే విప్లవకార్యాచరణగా పొరపాటు అవగాహనకు గురి కాకూడదని కాలక్రమంలో గానీ ఆనాడు నేను గ్రహించలేకపోయినా, తర్వాత వేగంగానే అర్థం చేసుకోగలిగాను. ఆనాటి మా తరం స్వీకరించినట్లు అన్వయ అవగాహనా లోపానికి నేడెవరూ గురికాకూడదని ఆశిస్తున్నాను.



రెండవది - 'వేతనశర్మకథ'ను అర్థం చేసుకోవటంలో కూడా ఆనాటి నుంచీ భిన్నాభిప్రాయాలున్నాయి. మధ్య తరగతిని - ముఖ్యంగా ఉపాధ్యాయ, ఉద్యోగ వర్గాలను - కార్మిక కర్షక ఉద్యమాలపట్ల సానుభూతి, సహానుభూతి, సంఘీభావం అందించే వారుగా దగ్గరకు తెచ్చుకుని మలుచుకోవాలా లేక వ్యవస్థతో సర్దుబాటు బతుకుకు, పాలకవార్గాల బుజ్జగింపులకు గురికమ్మనీ, వారి బెదిరింపులకు భయపడుతూ బతకమనీ నెట్టివేయాలా? ఈ కథలోని కీలక ప్రశ్న యిదే!

పెట్టుబడిదారీ వ్యవస్థ లక్షణాలైన కొన్ని ప్రజాస్వామిక స్వేచ్ఛలను, ట్రేడ్ యూనియన్ హక్కులనూ చూసి, ఇది కూడా ఒక తరహా బానిస వ్యవస్థేనంటే అర్థం చేసుకోలేని వారూ, ట్రేడ్ యూనియన్ చైతన్యం మాత్రమే గల వారు చాలామందే ఉన్నారు. దీన్ని వేతన బానిస వ్యవస్థగా ఏంగెల్స్ నిర్వచించాడు. కార్మికవర్గ పోరాటపు లక్ష్యం వేతన బానిసత్వాన్ని రద్దుచేయటం! రావిశాస్త్రి చెప్పిన వేతన శర్మలు (ఆనాటి ఉపాధ్యాయులు, ఎన్.జి.వోలు) కూడా ఈ వ్యవస్థీకృత బానిసలే! ఈ బానిసతనం పోవాలనే సామాజిక చైతన్యం వేతన శర్మలకు కలుగజెయ్యాలి గానీ, "పిడికెడు పిడికెడు" వేతనాలడిగి, చిటికెడు చిటికెడు' కరువు భత్యాల్లాంటివి సాధించుకునే తత్వాన్ని ఎగతాళో, వెటకారమో చేసి చివరకు ఉద్యమాలు, పోరాటాల వల్ల కలిగే నిర్బంధాలకు భయపడే తత్వమే ఖాయం చేయకూడదు. అలా చేసిందీ కథ, అన్నదే నా అభిప్రాయం. ఈ కథ 1971లో రాష్ట్ర ప్రభుత్వోద్యోగులూ, ఉపాధ్యాయులూ దాదాపు 90% మంది చేసిన 56 రోజుల చారిత్రాత్మక సమ్మె సాగుతూండగా, సరిగ్గా 44వ రోజున ఆంధ్రజ్యోతిలో వచ్చింది. ఆనాడే యిది ఉద్యమ వర్గాల నడుమ చర్చనీయాంశమైంది. ప్రభుత్వోద్యోగుల, ఉపాధ్యాయుల ఉద్యమంపై బ్రహ్మానందరెడ్డి ప్రభుత్వం జరిపించిన కాల్పులకు ఇద్దరు ఉపాధ్యాయులు (ఒకరి పేరు బదరీ నారాయణ) తిరుపతిలో మరణించారు. అలాంటి ఉద్యమ ఉధృతి నడుమ వేతన బానిస వ్యవస్థను పోషిస్తున్న రాష్ట్ర ప్రభుత్వ దోపిడీ, అణచివేతలకు వ్యతిరేకంగా, పోరాట స్ఫూర్తిని రగిలించే కథ రావాల్సి వుండగా - పిపీలికం కథలో తిరుగబడే కష్టజీవి తత్త్వాన్ని గొప్పగా ఆవిష్కరించినట్టే, వేతన శర్మ కథలో వ్యవస్థకు లొంగిపోయే మధ్య తరగతికి అది సహజతత్త్వమంటూ దానికి ప్రోత్సాహమిచ్చే విధంగా కథ సాగింది. వారిలో గల పోరాట చైతన్యాన్ని నీరుగార్చినట్లైపోయింది. ఆనాటికి, "సాయుధ పోరాటమే ఏకైక పోరాట రూపమనే వాదన, వర్గశత్రువులను వ్యక్తులుగా ఖతం చేయటమే విప్లవ కార్యక్రమమనే భావజాల ప్రభావం, ఉద్యమాల వాస్తవిక సమస్యలనెరుగని రచయితలపై చాలా వుండేది (ఇప్పటి స్థితి మరో కొసకు పోయిందనుకోండి) ఆ విధంగా నిర్దిష్ట సమయ సందర్భాలలో ప్రజా ఉద్యమ స్థితిగతులలోని సున్నితాంశాలను నిర్దుష్టంగా ఎరుగకుండా రాసిన కథగా 'వేతనశర్మ'ను నేను భావిస్తున్నాను.

ప్రజా ఉద్యమాల 'మెలికలు' (మెలుకువలు) తెలియకపోతే గొప్ప రచయితలు కూడా ఒకోసారి పొరపాట్లు చేస్తారనే దానికి ఉదాహరణ 'వేతనశర్మ' కథ. గొప్ప రచయితల చిన్న పొరపాట్ల ప్రభావం మాత్రం చిన్నగా వుండదు. అదీ గొప్పగానే వుంటుంది. "చెడుకు సహాయపడకూడద"ని రచయితలకు రావిశాస్త్రి చెప్పి వున్నారు. కానీ ఆయనను తీవ్రంగా ప్రభావితం చేసిన దుందుడుకు రాజకీయాల ప్రభావం పొరపాటు పంథాకు దోహదపడేలా చేసింది.

ఇది ఆయన కథల మీద, సాహిత్యం మీద తీర్పు కాదు. మన కాలపు రచయితలకు హెచ్చరిక.

ఈ రెండు కథల మీదా ఎంతో కాలంగా దాచిపెట్టుకుని వున్న నా అభిప్రాయాలకు అక్షరరూపాన్నిచ్చే సందర్భాన్ని కల్పించి కృష్ణాజిల్లా 'సాహితీస్రవంతి' వారికి ధన్యవాదాలు.



కథ

# లక్ష్మీ బ్రాంది షాపు - తెల్లరేషన్ కార్డు



- రామిశెట్టి రోశయ్య
9390279127

సుబ్బారాయుడు తన ఇజలాస్‌లో నుంచి 'సత్తెయ్యా! ఇటురారా" అన్నాడు.

సత్తెయ్య రాయుడు గారు ఎందుకో పిలిచారు సుబ్బారాయుడు "ఏమి లేదురా నీ పేరుతో బ్రాందీ షాపులు ఈ మండలంలో పెద్ద గ్రామాల్లో అన్ని చోట్ల "లక్ష్మీ బ్రాంది షాపుల పేరుతో పాడినాను. మొత్తం పాట ఒక కోటి పది లక్షలకు. పాట నీ పేరుతోనే వచ్చింది. వాళ్లందరిని మన ఎం.ఎల్.ఎ గారి అండతో పోటీలో ఉన్న అందరిని కొంత పైకము ఇచ్చి తక్కువ రేట్లకు అప్లికేషన్స్ పెట్టించాను. నీ పేరుతో పదివేలు ఎక్కువ పాట ఉన్నందున మనకే శాంక్షన్ అయింది. ఇదిగో ఈ కాగితాల మీద సంతకం పెట్టు" అన్నాడు.

సత్తెయ్య "మంచిది రాయుడు గారు. మా పోరగాడు ఇంటర్ చదువుతున్నాడు. చదువు మీద శ్రద్ధ లేదు. వాడిని మీరే మందలించి దారిలో పెట్టండి. ఎంత చదువుకొన్నా భుక్తికి సంపాదించాలిగా" అన్నాడు.

సుబ్బారాయుడు "దానికేమిటి వాడిని చదివించే బాధ్యత నాది. వాడిని ఒకసారి నా వద్దకు రమ్మని చెప్పు" అన్నాడు.

సత్తెయ్య పేదవాడు. మూడేకరాల పొలం ఉంది. ఒక కొడుకు పేరు రామం. ఒక కూతురు పది చదివిన తర్వాత రజస్వలైందని చదువు మానిపించాడు. పదహారేళ్ల వయస్సు. ముక్కు మొఖం చక్కగా ఉంటుంది. పెళ్లి చేయాలంటే పొలం మీద వచ్చే ఆదాయం పంట ఖర్చులకే సరిపోతుంది. భార్య మెళ్లో పుస్తేల తాడు పెట్టి ప్రైవేటు వ్యక్తుల వద్ద నాల్గు రూపాయల చొప్పున పదివేలు తెచ్చాడు. పొలం దస్తావేజులు బ్యాంకుల్లో పెట్టి ముప్పయివేలు తెచ్చాడు. సత్తెయ్య సత్యకాలం మనిషి. మాయమర్మాలు తెలిసిన వాడుకాదు. సుబ్బారాయుడు గారు అంటే అతనికి నమ్మకం.

సుబ్బారాయుడు రియల్ ఎస్టేట్ బేరాలు చేసి గత అయిదేళ్లల్లో కోట్లు సంపాదించాడు. అధికార పార్టీకి అండగా ఉంటాడు. ఎలక్షన్ల సమయంలో లక్షలు ఇచ్చి అధికార పార్టీ వైపు నిలబడ్డ ఎమ్.ఎల్.ఎని గెలిపించటంలో ముందుంటాడు. మాటలు చెప్పి మనుషులను లోబర్చుకొనే యుక్తి అతనికి బాగా తెలుసు. గెలిపించిన ఎమ్.ఎల్.ఎ.ల ద్వారా మంత్రులతో పరిచయాలు పెంచుకొన్నాడు. గత రెండు మూడు సంవత్సరాలుగా రియల్ ఎస్టేట్ వ్యాపారం ద్వారా సంపాదనకు తోడు జిల్లాలో ముఖ్య పట్టణాలలో 'వైన్' బిజినెస్‌లతో ఆదాయం అధికంగా పెంచుకోవటంతో పాటు పరిశ్రమలు పెట్టితద్వారా కార్మికులకు వందల మందికి ఉపాధి కల్పిస్తానని చెప్పి, ప్రభుత్వ భూములు, వందల ఎకరాలు, ముప్పయి సంవత్సరాల లీజుకు తీసికొని ప్రక్కనే ఉన్న రైతుల భూములను చౌకగా కదా బేరం చేసి రిజిస్టరీలు చేయించుకున్నాడు. వాటిని నివాసప్లాట్లుగా మార్చి అధిక లాభాలార్జించాడు. సుబ్బారాయుడు, సత్తెయ్యకు తన కొడుకు చదువు భరోసా కల్పించి కొడుకును తన వద్దకు పంపించమని చెప్పాడు. సత్తెయ్య కాలేజీలో ఇంటర్ దగ్గరి బస్తీలో చదువుకొంటున్న వాడిని పిలిపించాడు. సత్తెయ్య కొడుకు రాము రాయుడు గారి వద్దకు వచ్చాడు. నమస్కారం చేసి తన పరిచయం చేసికొన్నాడు. సుబ్బారాయుడు రామును దగ్గరకు పిలిచి "మీ నాన్న నిన్ను ప్రయోజకుడ్ని చేయండని పదే పదే కోరాడు. నీకు



ఒక కార్యం అప్ప చెప్పుతాను. దానిని జాగ్రత్తగా నిర్వహించాలి. దీని వలన నీ కుటుంబానికి ఆర్థిక లాభం కలుగుద్ది. నీ చెల్లి పెళ్లి కూడ మంచి సంబంధం చూచి పెళ్లి చేసే ఏర్పాటు నేను చేస్తాను. మరి నేను చెప్పినట్లు నడుచుకుంటావా" అన్నాడు.

రాము తల ఊపి "సరే" అన్నాడు. సుబ్బారాయుడు "ఏమి లేదు. రేపు ఫస్టు తారీఖు ఆదివారం గదా! నీవు చదువుకొనే పట్నంలోనే డిగ్రీ కాలేజీ మీ ఇంటర్ కాలేజీల మధ్య మన ''లక్ష్మీ బ్రాంది షాపు'' ప్రారంభిస్తున్నాను. నీవు తెలివిగా మీ విద్యార్థులందరిని అలాగే డిగ్రీ కాలేజి విద్యార్థులందరిని అక్కడకు వచ్చేట్లు నీవు ప్రయత్నించాలి. అక్కడ సినిమా స్టార్లు కూడ వస్తారు. డాన్స్ పోగ్రాము ఉంటుంది" అన్నాడు.

రాము సినిమా స్టార్స్ వస్తారనగానే లోలోపల సంతోషపడ్డాడు. చదువులో మందం, ఆటలు, పాటల్లో అందె వేసిన చెయ్యి రాము. ఆదివారం నాటికి డిగ్రీ చదివే వాళ్లను, తన కాలేజీలో ఇంటర్ చదివే వాళ్లను ప్రోగ్రాంకు వచ్చేట్లు ప్రోత్సహించాడు. యువకత్వంలో ఉన్నవాళ్లాయే వాళ్లకు కావలసినంత ఆవేశం, పట్టరాని ఆనందంతో ఈలలు వేసుకుంటు బ్రాందీ షాపు ఉత్సవానికి, ఓపెనింగ్ కార్యక్రమానికి వచ్చారు. టివి యాంకర్లు, చౌకబారు సినీ స్టార్లు వచ్చారు. ఎం.ఎల్.ఎ గారి అధ్యక్షతలో సభ ప్రారంభం. దేశభక్తి గీతాలతో సభ ఆరంభమైంది. ఉపన్యాసాలు సాగినవి. దేవతలు దేవుళ్లకు సోమరసం అంటే ఎంత ఇష్టమో, ఋషులు యజ్ఞాలలో ఎలా అగ్నిని, వాయువును వరుణ్ణిని సోమరసం కోసం ప్రార్థించేట్లు యజ్ఞకర్మలు ఆచరించే వారో తమ ఉపన్యాసాలలో వర్ణించి చెప్పేశారు. మరొ కొందరు వక్తలు ముఖ్యంగా ప్రజా ప్రతినిధులు యుద్ధ సమయాలల్లో, మన దేశ భక్తులైన వీర సిపాయిలు, ఆనాటి సోమ రసాన్నే ఈనాటి బ్రాందిగా, కాల పరిస్థితిల్లో వచ్చిన మార్పుననుసరించి, దీనిని సేవించి శత్రుమూకలను హతమార్చి, దేశ రక్షణనెలా కాపాడుతున్నారో, వివరంగా, హావభావాలతో వర్ణించి యువకులను ఉత్సాహపరిచేట్లు ఉపన్యాసాలు సాగించారు. ఈ మధ్యలో రాము లాంటి మెరికలు తేలిన కొందరు విద్యార్థులతో సుబ్బారాయుడు గారు ప్రతి విద్యార్థికి ఒక్కో బాటిల్ సప్లయ్ చేసేట్లు ఏర్పాటు చేశారు. విద్యార్థులు. ఇంక ఇతరత్రా సభా ప్రాంగణానికి వచ్చిన యువకులు ఒక్కో బాటిల్ తమ ప్యాంట్ల పాకేట్లలో దాచుకొన్నారు. డ్యాన్సుల ప్రోగ్రాము పూర్తి అయింది. జనగణమంగళ గీతాలాపనతో సభ ముగిసింది. విద్యార్థులు తమ తమ నివాసాల కెళ్లారు. అంతకు ముందే బ్రాందికి అలవాటు పడిన వాళ్లు కొందరైతే క్రొత్తగా డజన్ల మంది విద్యార్థులు ఇళ్ళకెళ్లి కొద్ది కొద్దిగా గ్లాసుల్లో షోడా నీళ్లు పోసికొని అందులో బ్రాందిని జోడించి దాన్ని సేవించి మత్తులో నిద్రాదేవి వడికి చేరారు. తెలివి గల పిండం సుబ్బారాయుడు. రాము అతని మిత్రుల ద్వారా ప్రారంభంలో ఉచితంగా బ్రాంది బాటిల్స్ ఇచ్చి ఆ యువకులకు రుచి చూయించిన ఫలితం మరుసటి రోజు నుంచే ప్రతిఫలం, వ్యాపార కేంద్రానికి రాసాగింది. లక్ష్మి బ్రాంది షాపులో సాయంత్రం అయ్యేసరికి ఒక్కొక్క విద్యార్థి వచ్చి బాటిల్స్ కొనుక్కొని తమ బసల్లోకి వెళ్లటం జరిగిపోతోంది. లక్ష్మి బ్రాంది షాపులు పట్నంలో అక్కడక్కడ గొలుసు బ్రాంది కేంద్రాలు ప్రారంభమైనాయి చౌకబారు బ్రాంది తయారి కేంద్రాలను సుబ్బారాయుడు గారు నెలకొల్పాడు. రోజు లారీల కొలది బ్రాంది అనేక బ్రాండ్స్ పేర్లతో దిగుమతి అవుతుంది. సత్తెయ్య కొడుకు రాము చదువు సంకనాకింది. ఒక గొలుసు కట్టు లక్ష్మి బ్రాందీ షాపులో సేల్స్‌బాయ్‌గా ఉండిపోయాడు. రాయుడుగారి వ్యాపారం మూడు పూలు ఆరు కాయలుగా ఆదాయాన్ని సమకూరుస్తున్నాయి. సత్తెయ్యకు కొంత ఆదాయం కొడుకు ద్వారా చేతికి అందుతుండటంతో బిడ్డ పెళ్లికి సంబంధం కుదిరింది. లగ్నాలు స్థిర పరచారు. పంచాంగం పంతుళ్లు.

విద్యార్థులలో త్రాగుడు వ్యసనంగా మారింది. సాయంత్రం వీధుల్లో త్రాగిన మత్తులో అల్లర్లు. గోడల మీద సినిమా వాల్ పోస్టర్ల మీద అంగనామణుల అర్ధనగ్న శరీర వంపులు సొంపులతో నాయకులతో ఆలింగన చుంబన దృశ్యాలు విద్యుత్ కాంతులతో, యువకులకు వళ్లు పొంగిపోవటం దారిన వెళ్లే అమ్మాయిల మీద అత్యాచారాల పర్వం ప్రారంభమైంది. పట్టణాలలో ఈ ఆగడాలపై మహిళా సంఘాలు ఊరేగింపులు నిరసన ప్రదర్శణలు టి.వి ఛానళ్లలో రాసాగాయి. పోలీస్‌శాఖకు హోమ్ డిపార్టుమెంటు నుంచి తాఖీదులు వచ్చాయి. గొలుసు బ్రాంది షాపుల మీద దాడులు సాగించారు. పోలీసులు రాత్రి పన్నెండు గంటల తర్వాత కూడ షాపులు అమ్మకాలపై వాటి లైసెన్సు దార్లపై నిఘా వర్గాలు (సి.ఐ.డి) ఆరా తీశాయి.

తెల్లరేషన్ కార్డు ఉన్న సత్తెయ్య ఇంటి మీద ఇలానే రాయుడు గారి ఆయా పట్నాలలో అమాయక తెల్లకార్డులు గల తన అనుచరుల ఇళ్లపై పోలీస్ రైడింగులు జరిగాయి. అత్యాచార ప్రయత్నాలు చేసిన యువ విద్యార్థులను వాళ్లను ప్రోత్సహించిన సత్తెయ్య కొడుకు రామును అరెస్టు చేసి ఎఫ్.ఐ.ఆర్ దాఖలు చేశారు.

పెళ్లి పీటల మీద సత్తెయ్య కూతురు నూతన పెళ్లి కొడుకు కూర్చుని ఉన్నారు. బ్రాహ్మలు మంత్రాలు చదువుతున్నారు. బంధువులు, స్నేహితులు, ఆడమగ రెండు వందల మంది కళ్యాణ మండపంలో పెళ్లి తంతు చూస్తున్నారు. కొంతమంది భోజన హాలులో కిక్కిరిసి ఉన్నారు. వడ్డణ సాగుతుంది. పెళ్లి పందిరిలో పిల్లవాడు పెళ్లికూతురు మెడలో తాళి కట్ట బోతున్నాడు. సరిగ్గా అదే సమయానికి పోలీసు ఎస్.ఐ. ఇతర కానిస్టేబుల్స్‌తో అక్కడకు వచ్చారు. పెళ్లి కొడుకును, పెళ్లికూతురు తండ్రిని అరెస్టు చేశారు. తెల్లరేషన్ కార్డు ఉన్న సత్తెయ్యకోట్ల రూపాయిల బ్రాందీ షాపు ఎలా చేజిక్కించుకున్నాడు? ఆరా తీశారు. రాయుడు గారి పేరు చెప్పాడు. అక్కడ రాయుడిని ఇక్కడ సత్తెయ్యను అరెస్టు చేశారు. పెళ్లి కొడుకు డిగ్రీ విద్యార్థి, త్రాగిన మైకంలో బస్సులో ఒక అమ్మాయిని కౌగిలించు కొన్న కేసులో అతన్ని అరెస్టు చేశారు. సత్తెయ్య రాయుడు ఒకే జైలులోకి పంపబడ్డారు.

## చూపులు

- కటుకోర్ఖ్వుల రమేష్
9949083327



కళ్ళు కళ్ళుగానే వుంటాయి
చూపులే మారుతుంటాయి
మనసు విచ్చుకోనంత కాలం
ప్రతి దృక్కును
ఓ దుష్ట గ్రహణం
ఆవహించే వుంటుంది

సుగుణాలు లోలోన
వెల్లివిరిసినప్పుడే
కనుపాపల్లో ప్రేమలు
మల్లియలవుతాయి

మసకల్లోనూ..
మమతల్ని కంటాయి

భయాలు భ్రమణాలై
దరిచేరినప్పుడల్లా
బెదురు కళ్లే తచ్చాడుతాయి
శాంతికీ అశాంతికీ మధ్య
చూపులు ఎప్పుడూ
నలుగుతూనే వుంటాయి
నిత్యం దృశ్యాలను మోస్తూ...

## మర్థనము

హిందీ మూలం : ప్రొ॥ రిషభ్‌దేవ్‌శర్మ
తెలుగు సేత : పేరిశెట్టి శ్రీనివాసరావు, 9989242343



ఎన్నో దెబ్బలు తిన్నాను నేను
నీ కోసం
నీ ప్రేమ కోసం

కలల్ని కన్నాను నేను,
నా వాడివవి నమ్మాను నిన్ను
ఎన్నో దెబ్బలు తిన్నాను
నాన్నచేతులతో,
సమాజపు చేతులతో కూడా,
సరే ! మంచిది, ఇది కూడా గొప్ప విషయమేనా...
ఆడది కలల్ని కనడం

ఆడది ప్రేమించడం
ఆడదానన్ని ప్రకటించుకొనడం !

నా ప్రతి అణువణువు రోదిస్తూ ఉన్నది
ఒక్క స్పర్శ కోసం
మరి నువ్వో
కుమ్ముతున్నావు నన్ను
మట్టనుకొని.

ఎన్నో దెబ్బలు తిన్నాను నేను
నీకోసం
నీచేతులతో !

## స్నేహం

నిర్వచించలేని...మధురానుభూతి
ఆత్మీయతను మీటే... మహతి
స్నేహం...
రెండు హృదయాల అనురాగస్పర్శ
ప్రత్యక్ష పవిత్ర పరామర్శ
స్నేహం...
ఇద్దరు మిత్రుల చెలిమి
నాలుగు పిడికిళ్ల బలిమి
కష్టాలలో.. కలిసొచ్చే చెలిమి
నిఖార్సైన నేస్తం.. ఆపదలో
అందివచ్చే అభయహస్తం

- డా॥ మల్లెమాల వేణుగోపాలరెడ్డి
9908591998

స్నేహ ప్రపంచం...
అంతరంగాలను ఆవిష్కరించే
అనంతక్షీర సాగరం
మధించగా పొంగివచ్చే
అమృత భాండాగారం
రెండు దేశాల మధ్య
ప్రణాళికల సంబంధం
శాంతి, సయోధ్యల సంధి
నిండు గుండెల ఒప్పందం
స్నేహానికి లక్ష్యార్థం.. ప్రేమ
పరమార్థం.. త్యాగం
రామ సుగ్రీవుల మైత్రి
కృష్ణ, కుచేలుల అనుబంధం
రాధేయ, రారాజుల బంధం



స్నేహానికి... చిరునామా
జీవితాంతం, జీవితానంతరం
చారిత్రక శాశ్వతంగా
నిలిచిపోయే... సాక్షి సంతకం

# చిలుకూరి దేవపుత్ర గురుదక్షిణకథ - దళిత స్పృహ

యం. ఆదిశేషయ్య

**1985లో జరిగిన కారంచేడు ఘటనతో దళితోద్యమం ప్రారంభమైనా, 1969 నుంచే దళిత సాహిత్యం వివిధ ప్రక్రియల్లో బలంగా వెలువడుతున్నట్లు అర్థం అవుతోంది. జాషువా, బోయి భీమన్న, శివసాగర్, కొలకలూరి ఇనాక్, కళ్యాణవు, ఎండ్లూరి సుధాకర్, సతీష్‌చందర్, శిఖామణి, నాగప్పగారి సుందర్రాజు, చిలుకూరి దేవపుత్ర దళిత సాహిత్యోద్యమానికి పరిపుష్టిని కలిగించారు. అప్పటి నుంచీ ఇటీవల లక్ష్మింపేట ఘటనదాకా దళితవాదంతో సాహిత్యం వెలువడుతున్న విషయాన్ని మనం గమనించవచ్చు.**




దళిత స్పృహతో విభిన్నమైన జీవితపార్శ్వాల నుంచి రచనా వ్యాసంగం కొనసాగిస్తున్న సృజనకారుడు చిలుకూరి దేవపుత్ర. 1952లో అనంతపురం జిల్లాలోని కాలువపల్లెలో జన్మించాడు. ఈయన కథ, నవలా ప్రక్రియల్లో ప్రసిద్ధులు. వీరి నవలల్లో అద్దంలో చందమామ, పంచమం, ఆరుగ్లాసులు, ఏకాకి నౌక చప్పుడు, వంకర టింకర ఓ, కక్షశిల, చీకటిపూలు.. కథల్లో గురుదక్షిణ, జీవనమాధుర్యం, మన్నుతిన్న మనిషి, నెర్లు, సమిధులు మంచి ప్రాచుర్యాన్ని పొందాయి. వీటిలో కొన్నిపలు భారతీయ భాషల్లోకి అనువాదమయ్యాయి. దేవపుత్ర సాహిత్యకృషికి గుర్తింపుగా పలు అవార్డులు పొందారు. కుల అసమానతలు, కరువు, మానవత్వం వీరి రచనల్లో ప్రధాన ఇతివృత్తాలుగా ఉంటాయి.

చిలుకూరి దేవపుత్ర రచయితగా దళిత జీవిత సామాజిక సంబంధాలను చిత్రించడం తన ప్రధానబాధ్యతగా స్వీకరించారు. తెలుగునేలపై దళితోద్యమం ప్రారంభం కాకమునుపే, దేవపుత్ర రచయితగా దళిత చైతన్యంతో దళిత జీవితాన్ని చిత్రిస్తూ రచనలు చేయడం ప్రారంభించారు. ఆయన కథలు భూస్వామ్య, పెత్తందారీ మనస్తత్వానికీ, దళితుల దైన్యానికీ మధ్య సంబంధాన్ని వాస్తవికంగా చిత్రిస్తాయి.

దేవపుత్ర చాలా కథా వస్తువైవిధ్యం వున్న రచయిత. ఆయన కథల్లో వ్యక్తులకంటే వ్యకులను నడిపించే సామాజిక శక్తులకు అధిక ప్రాధాన్యం ఇచ్చారు. ఇది పరిణతి చెందిన రచయిత లక్షణమని ప్రముఖ విమర్శకులు వల్లంపాటి వెంకటసుబ్బయ్య తాను రాసిన 'రాయలసీమలో ఆధునిక సాహిత్యం – సామాజిక సాంస్కృతిక విశ్లేషణ' గ్రంథంలో రాశారు.

1985లో జరిగిన కారంచేడు ఘటనతో దళితోద్యమం ప్రారంభమైనా, 1969 నుంచే దళిత సాహిత్యం వివిధ ప్రక్రియల్లో బలంగా వెలువడుతున్నట్లు అర్థం అవుతోంది. జాషువా, బోయి భీమన్న, శివసాగర్, కొలకలూరి ఇనాక్, కళ్యాణవు, ఎండ్లూరి సుధాకర్, సతీష్‌చందర్, శిఖామణి, నాగప్పగారి సుందర్రాజు, చిలుకూరి దేవపుత్ర దళిత సాహిత్యోద్యమానికి పరిపుష్టిని కలిగించారు. అప్పటి నుంచీ ఇటీవల లక్ష్మింపేట ఘటనదాకా దళితవాదంతో సాహిత్యం వెలువడుతున్న విషయాన్ని మనం గమనించవచ్చు.

దళితులకు జీవితంలో ఎదురయ్యే సమస్యలు భరించలేనివి. ఇలాంటి తప్పుడు కులవ్యవస్థ సృష్టించే అనేక సమస్యలకు ఎందరో బలయ్యారు. ఇంత జరుగుతున్నా సమాజంలో మేధావులుగా చెలామణి అవుతున్న వాళ్ళలో అనేకమంది ఈ పరిస్థితిని ప్రశ్నించని కాలమిది. ఈ సందర్భంలోనే చరిత్రలో నమోదు కాని అనేక అంశాలు సాహిత్యం ద్వారా వెలుగు చూస్తుంటాయనే ఆలోచన మనకు ఇదివరకే వుంది. ఇలాంటి పరిస్థితినే గురుదక్షిణకథ ద్వారా దేవపుత్ర చూపించారు. ఈ కథ మొదట 2001 మే 27వ తేదీ ఆదివారం వార్త దినపత్రికల్లో అచ్చయింది. ఆ తర్వాత తిరుపతి నుంచీ సాకం నాగరాజు సంపాదకత్వంలో వచ్చిన తెలుగు కథకి జేజే కథల






సంకలనంలోనూ, 2006లో పెన్నేటి ప్రచురణ సంస్థ తీసుకొచ్చిన బందీ కథా సంపుటిలోనూ, ఇటీవల రాష్ట్రోపాధ్యాయ సంఘం (ఎస్‌టియూ) ప్రచురించిన టీచర్ పుస్తకంలోనూ ఈ కథ ముద్రణ పొందింది.

గురుదక్షిణ కథ మొత్తం రైల్లేనే సాగడం ఒక ప్రత్యేకత. ఈ కథ చదివితే మధురాంతకం రాజారాం రైలు ప్రయాణం, కొలకలూరి ఇనాక్ బస్సుప్రయాణం కథలు గుర్తొస్తాయి.

ఓ విశ్రాంత తెలుగు ఉపాధ్యాయుడు, ఓ విద్యార్థి నల్లన్న ఈ కథలో ప్రధాన పాత్రధారులు. ఉపాధ్యాయుడు సంబల్‌పూర్‌లోని తన చిన్న కొడుకు గౌరినాథశాస్త్రి వద్దకు రైల్లో బయలుదేరుతాడు. ప్రయాణంలో నిద్రిస్తుండగా, తన సూట్‌కేస్‌ను ఎవరో దొంగలిస్తారు. అప్పుడు తనతో ఐదు రూపాయలు తప్పా, ఇంకేమీ ఉండదు. తీవ్రమైన ఆకలి, మధ్యాహ్నాం బయలుదేరేప్పుడు భోజనం చేయలేదు. అందులోనూ షుగర్ పేషెంటు. నీరసించి ఉంటాడు. తన శిష్యుడే ఒకరు రైల్లో కనిపించి గుర్తుపట్టి క్షేమ సమాచారాన్ని అడిగి తనపనిపై తాను వెళ్లిపోతాడు. రైలు ఇంకా సంబల్‌పూర్ వెళ్ళాలంటే రాత్రి పది కావచ్చు. సరే తనతో ఉన్న ఆ ఐదు రూపాయలకు ఏవైనా పండ్లు కొనుక్కుందామని అనుకుంటుండగా, హుషారుగా పండ్ల బుట్టతో ఓ కుర్రాడు అటుగా వస్తాడు. ప్రయాణికులతో ఏ భాష వాళ్ళతో ఆ భాష, ఏ యాస వాళ్ళతో ఆ యాస మాట్లాడుతుంటే టీచర్ ఆశ్చర్యపోతాడు. ఇలా రమ్మని ఆ కుర్రాడిని పిలుస్తాడు. అన్ని భాషలు మాట్లాడటం చూసి ఆ అబ్బాయిని పలకరిస్తే తెలుగువాడు తప్పా ఇన్ని భాషలు ఎవరు మాట్లాడగలరు సార్ అంటాడు. అంతకుముందే టీచర్‌ను గుర్తుపట్టి ఒక నవ్వువిసిరి అలా పోయిన ఆ కుర్రాడు.. టీచర్‌ను మీది అనంతపురం కదా సార్? మీరు నాకు గురువు అంటే, 23 ఏళ్ళ క్రితం నల్లప్ప అనే విద్యార్థి రూపం టీచర్‌కు ఎంత ఆలోచించినా గుర్తుకురాదు.

సార్ నేను ఎట్టి ఎల్లప్ప కొడుకుని. మాదిగోణ్ణి. మీరు ఆచారాలు పాటించే బ్రాహ్మణులు. అప్పుడు బడిలో మాల, మాదిగ పిల్లలు నీళ్ళు తాగాలంటే సిలవార్ చెంబుతో తాగేవాళ్ళం. అందులోనూ మిగతా వర్గానికి చెందిన పిల్లలు నా దోసిట్లోకి పైన్నుంచీ పోస్తే తాగాల. ఒకసారి బాగా దప్పికగా ఉంటే, నేను నీళ్ళు కుండలో చెంబు ముంచి తాగినా. దానికి మీతో పాటు టీచర్లంతా నన్ను బాగా కొట్టినారు. సచ్చేంత పనైంది. ఆ భయంతోనే నేను బడి వదిలేశా. మా నాన్న ఏదైనా పని నేర్చుకొమ్మని మా బంధువుల దగ్గర ఇడిస్తే, అక్కడి నుంచీ వచ్చి ఇదిగో నేను ఇలా ఈ పనిచేస్తున్నాను అంటూ జరిగిన సంగతంతా చెబుతాడు.

> **మనిషిని ఆచారాల పేరుతో అత్యంత క్రూరమైన కట్టుబాట్లు ఎలాంటి పరిస్థితుల్లోకి నెట్టుతాయో ఈ గురుదక్షిణ కథ ఒక ఉదాహరణ. అనేక భాషలను నేర్చుకున్న నల్లప్ప, గురువు చెంత బడిలో చదువుకొని ఉంటే ఎంత గొప్ప మేధావి అయి ఉండేవాడో కదా అనిపిస్తుంది. తనకు కీడు చేసినా గురువును గౌరవించి ఆకలి తీర్చిన నల్లప్పలోని ఆదర్శగుణం ఈ కథలో మనకు కనిపిస్తుంది. రచయిత నల్లప్ప పాత్రతో గొప్ప ప్రయోగం చేశారు.**

ఈ మాటలకు టీచరుకు ఏమీ తోచదు. అచేతనస్థితిలో ఉండిపోతాడు. నల్లప్ప మాత్రం గురువుకు ఒడిలో పండ్లూ, భోజనం టికెట్టు తీయించి వెళ్ళిపోతాడు. నల్లప్ప చెప్పిన మాటలకు గురువుకు ఆకలి ఎక్కడికి పోయిందో..? గురువు కళ్ళనిండా నీళ్ళు పెట్టుకోవడంతో కథ ముగుస్తుంది. ఇక్కడ గురువు కన్నీళ్ళు పశ్చాత్తాపాన్ని ప్రకటించినట్లు అర్థం అవుతుంది. ఒక అనాగరికమైన కులవ్యవస్థ నిర్మించిన విధిని టీచర్ ఆచరించడం, కారణంగా విద్యార్థి బడికి దూరం కావడం ఈ కథలో కనిపిస్తుంది. టీచర్ కన్నీటితో కథ ముగిసినా, సమాజంలోని అసలు కథలోని భావనలను మనకు ఆ తర్వాత ఆలోచన మనకందిస్తుంది.

మనిషిని ఆచారాల పేరుతో అత్యంత క్రూరమైన కట్టుబాట్లు ఎలాంటి పరిస్థితుల్లోకి నెట్టుతాయో ఈ గురుదక్షిణ కథ ఒక ఉదాహరణ. అనేక భాషలను నేర్చుకున్న నల్లప్ప, గురువు చెంత బడిలో చదువుకొని ఉంటే ఎంత గొప్ప మేధావి అయి ఉండేవాడో కదా అనిపిస్తుంది. తనకు కీడు చేసినా గురువును గౌరవించి ఆకలి తీర్చిన నల్లప్పలోని ఆదర్శగుణం ఈ కథలో మనకు కనిపిస్తుంది. రచయిత నల్లప్ప పాత్రతో గొప్ప ప్రయోగం చేశారు. ఏది ఏమైనా ఈ పాత్రలాంటి వాస్తవ జీవితాలు కులవ్యవస్థలోని అవలక్షణానికి ఎన్ని బలయ్యాయో కదా? అనిపిస్తుంది. ఈ సంఖ్యను ఏ పరిశోధనా సంస్థలు తేల్చగలవు? ఎన్ని విశ్వవిద్యాలయాలు కలిసైనా దీని అంతుతేల్చగలవా? అసలు అంతుతేల్చేపని వీటికి చేతనవునా? ఇప్పటికి చేతనై ఉంటే గురుదక్షిణ కథ గురించి ఇప్పుడు మాట్లాడుకునే అవసరం ఉండేదా?

దళిత సాహిత్యాన్ని సృజించడం, దళిత ఉద్యమాలు నిర్మించే అవసరం ఈ సమాజానికి తీరాలి. ఇదంతా జరుగుతోందంటే అర్థం.. సమాజంలో ఇంకా వివక్ష, అసమానుతలు సజీవంగా కొనసాగుతున్నట్లు అర్థం చేసుకోవాలి.. ఇలాంటి పరిస్థితి మార్పుకు జరిగే ప్రయత్నాల్లో సాహిత్యం, సాహిత్యకారులు భాగంకావాలి. అప్పుడే సాహిత్యానికి ఒక ప్రయోజకత్వం లభిస్తుంది. ఈ క్రమంలో జరిగే సామాజిక సాంస్కృతిక కృషిలో గురుదక్షిణ కథ ఒక ప్రబోధగీతం కాగలదు. ఇదే సందర్భంలో ఈ కథను అత్యంత ప్రతిభావంతంగా రాసిన రచయిత చిలుకూరి దేవపుత్రను తప్పక అభినందించాలి.



## చూపు

డా.వి. గీతా నాగరాణి



చూపుల చివర్న కత్తిమొనలుంటాయని
ఎదిగిన ఆడపిల్లల
ఎదలో నలిపే గాయాల్ని కదిపితే చెప్తాయి
నెమలీకతో సుతారంగా
చెంపలమీద నిమిరినట్లు
అందమైన స్పర్శలే కాదు
వేలితో తాకినా సరే
వళ్ళంతా యాసిడ్ పోసినట్లు
తనువుని నిలువెల్లా
విషసర్పమేదో చుట్టుకున్నట్లు
సాలెపురుగేదో పాకుతున్నట్లు
వికారపు స్పర్శలు
ఆడదానికి రెండే కళ్ళు
ఒకటి ప్రేమ
మరొకటి దయ
వాడికి వళ్ళంతా కళ్ళే
ఇంద్ర శరీరంలా..
కాంతిది రుజువర్తనమే
చూపులే వక్రీకరణం చెందుతాయి
వెల్తురు తోటలా విరబూసిన అందాల్ని
చీకటి చూపుల్తో కప్పేస్తారు
అంతరంగాల్లో ఆవిర్భవించే
పాలపుంతల కాంతిపుంజాల్ని
పట్టుకుని ఎగబాగి
నక్షత్రాల్లా ఎదగాల్సింది పోయి
ఇంద్రియ చాపల్యాలతో
మిగిలిపోయే లిల్లీపుట్లు వీళ్ళు
చూపుల్లో అనురాగం
పువ్వులా విచ్చుకోవాలి కదా
కాని వాడి చూపులో
ఆకలి విషపు కోరలా
గుచ్చుకుంటుంది.
ఆడపిల్ల అడుగు బైటపెడితే
కాళ్ళకడ్డం పడుతూ
ఎన్ని రకాల చూపులో..
నమిలి తినేసేలా కొన్ని
నిప్పు కణికలా కాల్చేసేవి మరికొన్ని..
కుట్రతో కొన్ని, కుళ్ళుతో మరికొన్ని..
స్త్రీని తంగడీ కబాబ్‌తో పోల్చే సమాజంలో
రక్షణ కోసం ఇనుప కచ్చడాలు
అవసరమే మరి..
ఆడవాళ్ళ మానాలకు కాదు
మురికి చూపుల మగాళ్ళ కళ్ళకు...

---

విద్యార్థి కవిత

## బిజీ మనుషులు

రౌతు కడలి

బిజీ అయ్యాయి మన పగలు సాయంత్రాలు
ఎపుడు వస్తున్నాయో ఎపుడు వెళ్తున్నాయో
అయిన మనం బిజి కదండి ఇవన్ని మనకెందుకండి
బిజీ అయ్యాయి మన రాత్రింబవళ్ళు
ఫలాన వేళ ఇక లేదు సేద తీరడానికి
అయిన.... రాగానే AC లోకి వెళ్తాం లెండీ !
బిజీ అయ్యాయి మన పక్షులు
తెల్లవారిందని చెప్పి లేపే కిలకిలలు విందామన్న వినబడుటలేదు
అయినా.... కావాలంటే Alarm పెడదాంలెండీ !
బిజీ అయ్యాయి మన పాడి పశువులు
ఎక్కడ కనిపిస్తున్నాయి మన ముగ్గులు, గొబ్బెమ్మలు
అయినా... కావాలంటే Flooring పైన Sticker లేద్దాంలెండి !
బిజీ అయ్యాయి మన చెట్లు చేమలు
బ్రతిమలాడిన తోరణాలై తూగనంటున్నాయి
అయినా ........... కావాలంటే Plastic తోరణాలు కడదాంలెండీ !
బిజీ అయ్యాయి మన రక్త సంబంధాలు
చివరికి చావైన కబురు చేసి వస్తే ఒకపూట Leave పెట్టెవాళ్ళం
అయినా... Sorry to say we can't come అని Mail పెడదాంలెండి !
ఎవరు బిజీ అయ్యారో ఏంటో !



కథ

# పద్మా నదీ తీరాన



తమిళ మూలం : కాశ్యపన్
హిందీ నుండి తెలుగు : మనస్విని

"అమ్మా! నీవు వెళ్ళలేదా?"

అపర్ణ తస్లీమా నవలను చదువుతోంది. కొడుకు డాలీ ప్రశ్నను విని కూడా ఆమె జవాబివ్వలేదు.

"అమ్మా!....చనిపోయిన వ్యక్తి నీకు తండ్రి. నాకు కాదు."

అపర్ణ తలెత్తి చూసింది. హాల్‌కు అటువైపు, చివర డాలీ భార్య నిలబడివుంది. ఆమె ముఖంపై భయం... అత్త ఏమి చెప్తుందో నన్న భయం.

"డాలీ! నీతండ్రి ఎవరు? అతడు బతికేవున్నాడా లేదా అని కూడా నాకు తెలియదు.. ఇప్పుడు చనిపోయినవాడు నాకు తండ్రి.

డాలీ తల వంచుకున్నాడు. అతని కూతురు గదిలోకి వచ్చింది. నాయనమ్మ తలను నిమురుతూ, తన గుండెకు హత్తుకుంది. నాయనమ్మ కోపం కొత్తదేమీ కాదు.

"నాన్నమ్మా! ఎందుకు అంత ద్వేషం?"నిషి అడిగింది.

"ఎవరి మీద?"

మీ నాన్నగారి మీద"

"ఆయన మీద కాదు"

"ఇంకెవరిమీద"

అపర్ణ మనవరాలి ప్రశ్నకు సమాధాన మివ్వలేదు.

మూడు నాలుగు తరాలు గడిచిపోయాయి. ఈ కొత్తతరం వాళ్ళకు తెలీదు. కాని, ఈతరం అమ్మాయిలు మెల్లమెల్లగా అర్థం చేసుకుంటున్నారు. మనవరాల్ని చూసింది అపర్ణ.' జూనియర్ కాలేజ్‌లో చదువుతోంది. గుండ్రటి ముఖం, పరిపూర్ణ యౌవనపు చురుకుదనం,...సంతోషం... తొణికిసలాడుతున్నాయి.

మనవరాలిని కౌగిలించుకుంది.

ఇదే వయసులో నన్ను... కళ్ళ నుండి అశ్రువులు రాలసాగాయి. నిశి ఆమె కళ్ళు తుడిచింది. నుదురు ముద్దుపెట్టుకుంది.

నౌరవాలీలో శాంతి తలెత్తసాగింది. కాని, కలకత్తా వూరుకోలేదు. హింసా సంఘటనలు గాంధీజీని పిలిపించాయి. స్వతంత్ర భారతం సుఖ ప్రసవం కాదు. వేలకొలది హిందూ, ముస్లిం స్త్రీల కడుపులో చిచ్చుపెట్టిన తరువాత జన్మించింది. అలా కడుపుకోతకు గురైన స్త్రీలలో అపర్ణ ఒకతి.

"ఇక ఇక్కడుండి ప్రయోజనం లేదు, కలకత్తా వెళ్ళిపోవాలి" అని అజిత్ సర్కార్ ఆలోచించాడు. యౌవనంలో వున్న ముగ్గురు కొడుకులు... తమ కున్న కొద్దిపాటి పొలంలో పని చేస్తారు. ఆ కుటుంబానికి సర్వస్వమూ చిన్నారి అపర్ణే! పాడి ఆవును చూసుకోవటం... అన్నలకు, తండ్రికి భోజనం తయారు చేసి, తినిపించటం.. అన్నీ అపర్ణే చేసేది.



పరిస్థితి రోజురోజుకూ విషమిస్తోంది. ఇరుగుపొరుగు ఇళ్ళలో అన్నదమ్ముల్లా వున్నవాళ్ళ దృష్టిలో కూడా తేడా కనిపిస్తోంది.

కలకత్తా వెళ్ళిపోవాలి. మధ్యన వుంది పద్మానది.

తూర్పు, దక్షిణ దిక్కుల నుండి వచ్చే వార్తలు భయాన్ని కలిగిస్తున్నాయి.

బ్రిటిష్ వాళ్ళు ఈ దేశం నుండి వెళ్ళే ముందు... ఇక్కడి మనుష్యుల్ని జంతువులుగా మార్చి పోతారు.

మొత్తం ఎనిమిది మంది నడుస్తున్నారు...ఏడుగురు మగవాళ్ళు... ఒకతే స్త్రీ... ఇరవై మైళ్ళు నడవాలి. పగలే నడవాలి. రాత్రుల్లో గుంపులు గుంపులుగా వచ్చి, దాడి చేస్తారు. చంపుతారు. తప్పించుకొని వెళ్ళే వాళ్ళనూ వదిలిపెట్టరు. అపర్ణ రెండో అన్న ఆమెతో కలిసి, నడుస్తున్నాడు. తండ్రి, ఇతరులూ ముందు నడుస్తున్నారు. దుండుగుల నుండి తప్పించుకొని వచ్చిన ఇంకో ముగ్గురు కూడా వచ్చి వాళ్ళతో కలిసారు. రాత్రుల్లో పద్మానది ఒడ్డున వున్న ఎత్తైన పొదలు, చెట్ల మధ్య దాక్కుంటారు.

దారిలో గుంపు... గుంపుల్లో జనాలు.. ఎద్దులబళ్ళు.. వాటిలో ఇంటికి పనికి వచ్చే, రానీ సామాను... వీళ్ళ వైపు... దొంగతనం... దోపిడీ.. హత్యలు.. స్త్రీల మానభంగం.. చేసే జంతువులు..

అపర్ణ సిగ్గుతో ముడుచుకుపోతూ నిలబడింది. వేరే మార్గమే లేదు. అన్న లుంగీ కట్టుకొని వుంది... పైన పెద్ద షర్ట్.. తలకు పాగా.. తలమీద సామానులున్న గంప. దూరంగా, నిర్మానుష్యమైన నదీతీరంలో వెళ్తునప్పుడు ఆమె ఆడపిల్ల అని ఎవరూ గుర్తించలేరు... పైట లేకుండా.. ఒక షర్ట్‌తో శరీరాన్ని.. ఈ నరకాన్ని అనుభవించటం కన్నా పద్మానదిలో దూకి.. అపర్ణ దీర్ఘంగా నిశ్శ్వసించింది.

ముగ్గురు నలుగురు వస్తున్నట్టు కనిపించింది. దగ్గరి కొచ్చిన తరువాత తెలిసింది... వాళ్ళ దగ్గర ఆయుధాలున్నాయని. వీళ్ళెవరు?... మనుష్యులు.. వీళ్ళు నా సహాయకులా లేక శత్రువులా... అపర్ణ, ఆమె అన్న ఇద్దరూ చెట్ల మధ్య దాక్కున్నారు.

"ఏయ్! ఎవరు మీరు? ఆగండి."

అజీత్ సర్కార్ ఆగిపోయాడు. అలాగే నేలపై కూర్చొండి"కూర్చున్నారు.

అపర్ణ, ఆమె అన్న వూపిరి బిగబట్టి, చెట్ల వెనుక నుండి చూడసాగారు. "ఎంత మందున్నారు మీరు?"

ఎవరూ జవాబివ్వలేదు. ఆగంతుకుల్లో ఒకడడిగాడు'' దూరం నుండి చూస్తే ఎనిమిదిమంది కనిపించారు. ఇప్పుడు ఆరుగురే వున్నారేం?"

ముందు కూర్చున్న వాడి వీపుపై ఒక దెబ్బ పడింది గట్టిగా.. కరకు లాఠీ దెబ్బ ! దగ్గరున్న ఇంకొకడు దెబ్బలు తప్పించుకోవటానికి చెప్పాడు.

"ఆడవాళ్ళున్నారా?" "ఎనిమిది మంది"

అతడు తల వూపాడు.

"ఎక్కడ?" అతడు చెట్ల వైపు చూసాడు.

"కుక్కల్లారా! పారిపోండి."

లాఠీలతో కొట్టారు... ప్రాణాలు కాపాడుకోవటానికి పరిగెత్తారు... తండ్రి... అన్నలు.. చెట్ల మధ్య తనతో బాటు దాక్కున్న అన్న... అందరూ.. అపర్ణను ఆగంతుకుల మధ్య... ఆర్తనాదాల మధ్య ఒంటరిగా విడచిపెట్టి, తమ ప్రాణాలు కాపాడుకోవటం కోసం పరిగెత్తిపోయారు.

నిశి నాయనమ్మకు టీ తెచ్చి, యిచ్చింది. సోఫాలో నాయనమ్మా, మనవరాలూ కూర్చున్నారు. డాలీ వరండాలో వుయ్యాల మీద కూర్చున్నాడు. డాలీ భార్య టీ.వీ. తుడుస్తోంది.

"అమ్మ వెళ్ళదు. నేను వెళ్ళనా?" డాలీ భార్యతో మెల్లగా అడిగాడు.

"ఆమె చూడకుండా వెళ్ళండి."

నిశి నాయనమ్మ ఒడిలో తల పెట్టుకొని, పడుకుంది.

"నాన్నమ్మా!"

# మా ఊరి చెరువు



కర్ణకోట రవీంద్రనాథ్
9441283830

ఇదేనా మా చెరువు ! కంప చెట్లతో నిండిపోయిందేమి ?
ఇదేనా ఆ తూము! ఇనుప తలుపులు చెల్లా చెదురుగా ఉన్న వేమి !
ఇదేనా ఆ అలుగు రాళ్ళు చిందర వందరగా ఉన్నవేమి !
నా చెరువును చంపేసారు, నా జ్ఞాపకాలను సమాధి చేసారు
వానా కాలం వచ్చిందంటే ఎక్కడ చూసిన నీళ్ళే
దూది పరచినట్లు ఉండేది
వానా కాలం వచ్చిందంటే ఎప్పుడూ చెరువు సంగతులే
రెండుమెట్లు వచ్చినవని కొందరు, నాలుగు మెట్లు
వచ్చినవని కొందరు
మెట్ల లెక్కలు నీళ్ళ కొలతలు.
ఆ చెరువుకు పన్నెండు మెట్లు అవన్నీ నిండితే
ఆ చెరువు నిండినట్లు, ఆకలి తీరినట్లు
చెరువు నిండిన కనుచూపు మేర నీళ్ళు
నిండు కుండలా ఉండేది.
చెరువులోని కెరటాలు కట్టను ముద్దాడగ మృదంగ
ధ్వని ధ్వనించేది
చెరువు నిండి అలుగు పారితే తొక్కితే నీళ్లొచ్చేవి
మట్టి గోడలు చెమటలు పట్టినట్లు ఉండేవి.
అలుగు సవ్వడి హోరెత్తించేది
ఆ సవ్వడి ఆనందోత్సవాలు కలిగించేది.
అలుగు దుంకగా ఆ నీటి కెరటాల కింది నుంచి
ఆ వైపు నుంచి ఈ వైపుకు కెళ్ళేవాళ్ళం
అలుగు నీటితో ఆడుకొనె వాళ్ళం
పాడుకొనె వాళ్ళం
కనిపిస్తాయా! ఆ నీళ్ళు మళ్ళీ వస్తాయా ! ఆ రోజులు
ఏ మాయలోడి విషపు చూపో మా చెరువును కురూపిని చేసింది.

---



"ఊ"

"ఇక్కడికొచ్చాక నీవు మీ నాన్నగారిని చూడలేదా?"

"చూసాను"

"ఎక్కడ?"

"శరణార్థుల శిబిరంలో. కడుపులో బిడ్డతో"

"ఆయనేమన్నారు?"

"నాకెప్పుడో నీళ్ళు వదిలేసారు వాళ్ళు. ఆ దుర్మార్గుల చేతికి దొరికేందుకన్నా ముందే నదిలో దూకి, చచ్చిపోవాల్సింది."

అపర్ణ కంఠం రుద్ధమైంది. మాట్లాడలేకపోయింది.

నిశి లేచి, వెళ్ళి, చల్లటి నీళ్ళు తాగించింది. నీళ్ళు త్రాగి, ఆమె తన మాటల్ని కొనసాగించింది." ఆయన అలా చెప్పాడు. నాకు కూడా అలాగే అనిపించింది. నేనెందుకు దూకలేదు?... భయమా...? మృత్యుభయమా?.. మృత్యువుకన్నా తక్కువా ఈ జంతువులు? నేను తప్పు చేసానా?"

ఆ తరువాత ఆమె మాట్లాడలేదు.

మెల్లగా లేచి, కిటికీ దగ్గర నిలబడింది. దూరంగా ఎగిరే విమానం చుక్కలా కనిపిస్తోంది. నగరపు పోష్ కాలనీలో ప్లాట్. కొడుకు డాలీ డాక్టర్... కోడలు... మనవరాలు.. అందుకే నేను నదిలో దూకలేదా?" అపర్ణ నిశి దగ్గరకొచ్చింది.

'అతనికేం హక్కుంది?.... నన్ను చావమని చెప్తాడు?' 'రాస్కెల్' తన ప్రాణాలు కాపాడుకొనేందుకు... నన్ను... నాబలి.. అతనెందుకు దూకలేదు నదిలో...

డాలీ పుట్టాడు. శాంతినికేతన్ ఆశ్రయమిచ్చింది. నేర్చుకున్న రవీంద్ర సంగీతం నాకు అన్నం పెట్టింది. జీవికను చూపించింది."

"నాన్నమ్మా!"

"ఊ"

"నాన్న వెళ్తున్నాడు. నీవేమంటావు?"

"రామునికి పట్టాభిషేకం జరిగింది. కాని, సీతే అడవికి వెళ్ళింది. అన్నదమ్ములు కురుక్షేత్రంలో కొట్టుకొని చచ్చారు. కాని, నింద ద్రౌపది మీద పడింది. జాతి, మతం... ఏకారణంగా యుద్ధం జరిగినా కష్టం స్త్రీకే కలుగుతుంది."

"నా ప్రశ్నకైతే సమాధానం దొరకలేదు."

"ఏమిటి"

"నాన్న వెళ్తున్నాడు."

"వాడు తప్పక వెళ్తాడు. మగవాడు కదా! నా భావనలు, లాజిక్ వాడికి అర్థం కావు. నీవేం చేస్తావు నిశీ?"

"నేను నీ పార్టీనే నాన్నమ్మా' నిశి ప్రేమగా ఆమెను కౌగిలించుకుంది.



# శ్రీపతి కథల్లో స్త్రీచైతన్యం

మన్యం. నరసింహులు

విద్యార్థిదశ నుంచీ పుస్తక పఠనంపై మక్కువ పెంచుకున్న శ్రీపతి తదనంతర కాలంలో హైదరాబాద్, ఢిల్లీ మహానగరాలలో చాలాకాలం ఉద్యోగ నిమిత్తం ఉండటం వల్ల ప్రపంచ ఆధునిక దృక్పథాన్ని అలవరచుకోవటం సాధ్యమైంది. ఈ ప్రపంచానుభవమే అతని కథాసాహిత్యానికి బలాన్ని, విస్తృతిని కలిగించింది. ఈ కారణంగానే శ్రీపతి కథల్లో పాత్రలు సహజత్వానికి దగ్గరగా వుండడమేగాక కాస్తా ఇంటలెక్చ్యువల్‌గా ఆలోచిస్తాయి. స్త్రీపాత్రలైతే మరీ చైతన్యవంతంగానూ ఆధునికంగాను, విశాలదృక్పథంతోను చిత్రించబడ్డాయి.



శ్రీకాకుళం జిల్లా గిరిజన ప్రాంతాల్లోనూ, నదీతీరాలలోనూ, పల్లె సీమలలోనూ నివసిస్తూ నాగరికతకు అనాగరికతకు మధ్య, జ్ఞానానికీ అజ్ఞానానికీ మధ్య కొట్టు మిట్టాడే ప్రజలలోంచి వాళ్ల గాథల్ని బాధల్ని ప్రపంచానికి చాటడం కోసం శ్రీపతి సాహిత్య రంగంలో ప్రవేశించాడు. 1960వ దశకం నుండి దాదాపు అరవై కథలకి పైగా అచ్చయినవాటిని ఐదు సంపుటాలుగా ముద్రించాడు శ్రీపతి. అవి మంచుపల్లకి మరి తొమ్మిది, ఎల్లోరాలో వాళ్ళు ముగ్గురు, సత్యజిత్‌రాయ్ ఎవరు, బెనారస్ చిత్రాలు మరియు కాటుకకళ్ళు, కథలు మూడు. శ్రీపతి అసలు పేరు పుల్లట చలపతిరావు. శ్రీపతి అనేది వీరి కలం పేరు. వీరి స్వస్థలం శ్రీకాకుళం జిల్లా, కవిటి మండలంలోని భైరిపురం. శ్రీపతి 11వ తరగతి చదువుతున్నప్పుడు ఆంగ్లోపాధ్యాయులు యడవల్లి వెంకట సూర్యనారాయణ చెప్పే పాఠ్యబోధనతో ప్రభావితులై రచనా వ్యాసంగంలోకి ప్రవేశించానని తానే స్వయంగా చెప్పుకున్నారు.

విద్యార్థి దశ నుంచీ పుస్తక పఠనంపై మక్కువ పెంచుకున్న శ్రీపతి తదనంతర కాలంలో హైదరాబాద్, ఢిల్లీ మహానగరాలలో చాలాకాలం ఉద్యోగ నిమిత్తం ఉండటం వల్ల ప్రపంచ ఆధునిక దృక్పథాన్ని అలవరచుకోవటం సాధ్యమైంది. ఈ ప్రపంచానుభవమే అతని కథాసాహిత్యానికి బలాన్ని, విస్తృతిని కలిగించింది. ఈ కారణంగానే శ్రీపతి కథల్లో పాత్రలు సహజత్వానికి దగ్గరగా వుండడమేగాక కాస్త ఇంటలెక్చ్యువల్‌గా ఆలోచిస్తాయి. స్త్రీపాత్రలైతే మరీ చైతన్యవంతంగానూ ఆధునికంగాను, విశాలదృక్పథంతోను చిత్రించబడ్డాయి.

జీవితాన్ని తమ చేతుల్లోకి తీసుకొని చరిత్రను తిరగవ్రాయటానికి సిద్ధపడుతున్న మహిళాపాత్రలే శ్రీపతి కథల్లో దర్శనమిస్తాయి. స్త్రీ పాత్ర ఎంతో ఉదాత్తంగా, ఉన్నతంగా, గౌరవ ప్రదంగా కనబడుతుంది. అలా చిత్రించిన పాత్రల్లో 'రాత' కథలోని పార్వతి పాత్ర. ఈ కథలోని పార్వతి ఒక హైస్కూల్‌లో బి.యిడి. టీచర్. ఆడపిల్లలు "పై చదువులు చదవాలని, ఆ చదువు వాళ్లకు యోగ్యులైన, విద్యావంతులైన వరులను తెచ్చి పెడతాయని" పార్వతి అభిప్రాయం. "అమ్మాయిలు పద్దెనిమిది సంవత్సరాలలోపు పెళ్ళి చేసుకోకూడదని, ఇష్టపడిన వరుడు తారసపడినప్పుడే చేసుకోవాలని కట్నాలు కావాలని కోరేవాళ్లను దూరంగా ఉంచాలని" తన అనుభవాల ఆధారంగా చెబుతుంటుంది. స్త్రీకి తన జీవితం మీద తనకు అధికారం ఉండాలన్న ఆధునిక దృక్పథం పార్వతిది. కనుకనే పెళ్లికి స్వాతంత్ర్యానికి మధ్య వైరుధ్యం ఉండటాన్ని గుర్తించి దాని గురించి ఆలోచించిది. తనను ఉద్యోగం చేసుకోనిస్తారా అత్తగారు? నాన్నకు పైసలు పంపనిస్తారా? తను సంపాదించుకొన్న పైసలతో తనకు కావలసిన వాటిని కొనుక్కోనిస్తారా? ఇవి ఆమెను వెంటాడే ప్రశ్నలు. ఈ ఆలోచనలే ఆమెను ఉన్నత మహిళగా నిలబెడతాయి.

బెనారస్ కథల సంపుటిలో స్త్రీపాత్ర ప్రధానంగా నడచిన 'స్నేహితులు' కథలోనూ మాధవి పాత్ర కూడా అలాంటిదే. ఢిల్లీ మహానగరం రంగస్థలంగా నడచిన ఈ కథలో 'మాధవి' తన ఆకర్షణలు, ప్రేమలు, వైఫల్యాల, గురించి నిర్భయంగా మాట్లాడనూగలదు. చేసిన తప్పుల గురించి పశ్చాత్తాపం ప్రకటించగలదు, దిద్దుకోనూగలదు. తెలుగువాడైన శివాజీ అనే విద్యార్థి నాయకునితో స్నేహం చేస్తుంది. శివాజీని పెళ్ళి చేసుకోబోతున్నట్లు అందరికీ విజయగర్వంతో చెప్పుకుంటుంది. అయితే ధనవంతులయిన తన తల్లిదండ్రులకు తనను పరిచయం చేయటానికే భయపడిన శివాజీ



పట్ల ఆమెకు సందేహాలు కలిగాయి. అందుకే అవకాశవాదియైన అతనిని వదులుకుంటుంది. పైగా జె.యన్.యూ లోనే పోస్టు డాక్టొరల్ పరిశోధన చేస్తున్న మధ్యతరగతి వ్యక్తి భట్టాచార్యపై ప్రేమను పెంచుకుంటుంది. నిర్భీతి, నిర్మోహమాటం, గాంధీయిజం మీద నమ్మకం ఆదివాసీ గ్రామ ప్రాంతాల పిల్లల కోసం బడి పెట్టుకొని అక్కడే గడపాలన్న ఆదర్శం దాన్ని నెరవేర్చుకొనటానికి అతను చేసే ప్రయత్నాలు – ఇవన్నీ మాధవికి అతని పట్ల అభిమానాన్ని పెంచాయి. వద్దనుకున్న దాన్ని వదిలించుకొనటం, ఆశించిన దాన్ని పొందటం కోసం ప్రయత్న పరురాలు కావటం మాధవిని స్వతంత్ర్య వ్యక్తిగా నిలబెడుతాయి. అయితే శివాజీ ఇప్పటికీ మాధవి వెంటపడుతూనే వుంటాడు. గొప్ప ధనవంతుడైన శివాజీని వదులుకొన్న మాధవిలో ఆస్తి, అంతస్థులపట్ల నిర్మోహాన్ని తెలియచేయటమే కాక మధ్యతరగతి భట్టాచార్యను కోరుకోవటంలో ఆమె ఆదర్శాలను, స్వతంత్ర్య వ్యక్తిత్వాన్ని తెలియచేస్తున్నది. అందువల్లనే "భద్రమహిళ ఆవిర్భావం మాధవి ద్వారా సూచితమైంది" అంటారు ప్రముఖ కథారచయిత మధురాంతకం రాజారాం 'బెనారస్ చిత్రాలు' కథా సంపుటికి రాసిన ముందుమాటలో.



అలాగే 'పెద్దల న్యాయం' కథలో సర్పంచి భార్య పద్మావతమ్మ పాత్రా ప్రత్యేకంగా గమనించదగ్గదే. సీతమ్మను, ఆమె కొడుకు సుబ్బడిని తేనె దొంగతనం తగువు తీర్చటానికి పంచాయితీకి పిలిపించిన సందర్భంలో ఈమె ప్రస్తావన వస్తుంది. "ఆడమనిషిని తగువుకు పెద్దమనుషులమధ్యకు పిలిపించేది చాలా తక్కువ. అత్తాకోడళ్ళ మధ్య, తల్లీ కూతుళ్ళ మధ్య, ఇరుగుపొరుగు స్త్రీల మధ్య గొడవలు వచ్చినపుడు సర్పంచి ఈ ఇద్దర్ని ముగ్గుర్ని మాత్రమే" పిలిపించి మందలిస్తాడు (సత్యజిత్ రామ్ ఎవరు, పు. 126). కొన్ని సందర్భాలలో సర్పంచి భార్య పద్మావతమ్మ కూడా వాళ్లతో మాట్లాడి వ్యవహారం చక్కబెడుతుంది. కనుకనే సీతమ్మను పెద్దమనుషుల మధ్యకు పిలిపించిన పద్ధతి పద్మావతమ్మకు నచ్చలేదు. పెద్దమనుషుల తీర్పు న్యాయంగా లేదని వాళ్ళను ధిక్కరించి సీతమ్మ వెళ్ళిపోతే అక్కడి పెద్దలందరూ ఆమెలో తప్పునే చూశారు. కానీ పద్మావతమ్మకు మాత్రం "సీతమ్మ తిట్లు తిట్లులా అనిపించలేదు. కొడుకును తల్లికాకపోతే ఎవరు కాపాడుకుంటారు. దాని తల్లి మనసు ఎంత బాధపడకపోతే అది అందరి ముందు అంతతెగిస్తుంది. అది మంచి పనే చేసింది అక్కడి నుంచి వెళ్ళిపోయి" (పు. 134) అని సీతమ్మ చర్యను మనసులోనే సమర్థించింది. మాటలోనే కాదు, మనసులో కూడా సీతమ్మ పట్ల సానుభూతి చూపటంలో భర్తల అధికార స్వభావం లాంటిది భార్యలది కాదని చెప్పటం, స్త్రీలను స్త్రీలే అర్థం చేసుకోగలరని చెప్పటం – రెండూ ఉన్నాయి. అధికార మదాంధతతో పురుషులు కోల్పోయిన మానవీయస్పర్శను స్త్రీలు సజీవంగా ఉంచుకొన్న వైనాన్ని పద్మావతి పాత్రలో సూచితమైంది. ఈ కారణంగానే ఈ కథలో మిగిలిన అన్ని పాత్రలకన్నా పద్మావతమ్మ పాత్ర సహజంగా, సజీవంగా గొప్ప జీవ సంస్కారంతో ప్రకాశిస్తుంది.

మొత్తం మీద శ్రీపతి స్త్రీ పాత్ర చిత్రణలో మాతృత్వ శోభకు, వ్యక్తి ప్రకాశానికి ప్రాధాన్యత నిచ్చారు. కాశీ అన్నపూర్ణతో పోలిక చెప్పి స్త్రీలను దేవీరూపాలుగా సంభావించటమూ కనిపిస్తుంది. స్త్రీలను అవమానపరచే మాటదేన్నైనా తిప్పికొట్టడం ఆయన రచనా దృక్పథంలో ప్రధానాంశం. 'సరిహద్దులు' కథలో కులాంతర ప్రేమ వివాహం చేసుకున్న మనుమడు మూర్తికి బుద్ధి చెప్పటానికి వచ్చిన సూరన్న తాత తన పెద్దమ్మ కొడుకును గురించి చెబుతూ "మందెట్టేసింది ఓ లంజ" (మంచు పల్లకి మరి తొమ్మిది, పు. 63) అంటాడు. ఆ మాట మనుమడిని వివాహం చేసుకున్న "కారుణ్య అమృత హృదయంలో విషశరం గుచ్చుకున్నట్టయ్యింది" (పు. 63) మూర్తి తాత లంజ అన్న స్త్రీ గురించి "ఆమె ఎంత గొప్పదో. ఎంత ఉన్నత కళాహృదయమో? రూపవతో? ఆమె సాన్నిధ్యంలో ఏ ఆకర్షణ బంధించిందో? ఏ గానం విన్నాడో? ఏ తేజస్సును చూశాడో?" (పు. 64) అని ఆలోచించినట్లు చెప్పటం ద్వారా యువతరం స్త్రీ పట్ల అలవరచుకొనవలసిన నైతిక మానవీయ దృక్పథాన్ని స్ఫురింపచేశారు శ్రీపతి. తనను ప్రేమించిన తల్లి, కూతుళ్ల స్థానం కారుణ్యకిస్తాడు. అంతేకాకుండా అక్కడ గుడిలో ఉన్న దేవీ అమ్మను గుడిబైట కారుణలోనూ చూస్తాడు సూరన్నతాత.

స్త్రీ పాత్రల చిత్రణలో శ్రీపతి చూపిన నిజాయతీ, జాగ్రత్త ఆశ్చర్యకరంగా ఉంటాయి. "ఒక స్వప్నం" కథలో పద్మావతిది తిట్టేనోరు. పెళ్ళి చేసుకొని కాపురానికి వెళ్ళి నిండా నెలదినాలు కాకుండానే మొగుణ్ణి వదలిరావటానికి ఆ నోటి దురుసే కారణమైంది ఆ ఊరికి కొత్తగా వచ్చిన బ్యాంకు ఉద్యోగి ఆమె ఇంటి పక్కయింట్లో అద్దెకు దిగుతాడు. ఆమె ఇతరులను తిట్టే తిట్లను వింటూ కాలం గడుపుతుంటాడు. ఆ వూరులో లెక్కల మాస్టారు సింహాచలం నాయర్ హోటల్‌లో టీ తాగుతూ పద్మావతిని గూర్చి "దీనికుక్కాడా ఒక కర్ణుడు పుడతాడు. అప్పుడు గానీ దీని నోరు మూత పడదు." (బెనారస్ చిత్రాలు, పు. 167) అన్నాడట. ఆ విషయం తెలిసిన పద్మావతి కండ్ల నీరు పెట్టుకుంటుంది. ఆ విషయం తెలిసిన భాస్కరం "రమేష్ పండాలూ, లెక్కల మాష్టరు సింహాచలాలు ఉన్న ఊళ్లో పద్మావతి గయ్యాళి కాకుండా ఎట్లా బతకగలుగుతుంది." (పు. 167-168) అని శ్రీపతి వ్రాసిన వాక్యం స్త్రీల స్థితి గతులపట్ల నిజాయితీగా స్వతంత్రంగా గతానుగతిక విధానానికి భిన్నంగా ప్రతిస్పందించే తత్వాన్ని సూచిస్తుంది.



ఈ విధంగా శ్రీపతి కథల్లో స్త్రీ పాత్రలు ఎంతో చైతన్యంతో మానసిక ఆరోగ్యంతో ఎంతో సజీవంగా చిత్రించబడి ఒక సామాజిక ప్రయోజనాన్ని సాధించేవిగా వుంటాయి.

కవిత

# పాత పాటగా వినిపించే సరికొత్త పాట

- సాహిత్యప్రకాశ్
9492530542



ఏగలంతా తీరికలేని పనుల్తో
రెక్కలు ముక్కలు చేసుకున్న నగరం
అలసి సొలసి
నాలుగు రోడ్ల కూడలిలో నడుంవాల్చింది
చలి పులిపంజా విసిరి
కలలను తునాతునకలు చేస్తూ
తన కాలబలిమిని కసిగా చాటుకుంటోంది
నియోన్ లైట్ల వెలుతురులో
కన్నెపిల్ల సిగ్గులా కనీకనిపించకుండా
మంచు, హృదయపు అంచును తాకుతోంది
నగరం ఆదమరచి నిద్రపోతున్నవేళ
ఆమె మాత్రం 'ఆవు'లింతల్ని
బాధ్యతల తాడుతో బలవంతంగా కట్టిపడేసి
తన మంత్రదండంతో రోడ్డున పడుతుంది
నగరపు శిలాఫలకంపై విధిరాతౌతుంది
అక్కడ ఉలుకూ పలుకూ లేకుండా నిటారుగా నిలబడి
ఆమె రాక కోసమే ఎదురు చూస్తున్న బాపూజీ
వీరవనితలా వస్తున్న ఆమెను చూసి
తాను కోరుకున్న స్వాతంత్ర్యం దేశానికి వొచ్చిందనుకుని
తెలియనితనంతో గర్వంగా మురిసిపోతాడు
మహాత్ముడికి భక్తిభావంతో దణ్ణంపెట్టి
మంత్రదండాన్ని మమకారంతో సరిచేసుకుని
మహానగరపు రహదారుల వెంట
ఆమె క్రమశిక్షణల కవాతు చేస్తుంది
ఆమె ఆత్మీయతకి పులకించిన నగరం
నవ వధువులా కళకళగా మెరిసిపోతుంది
పెళ్లి పీటలపై కూర్చున్న కూతుర్ని చూసి
ఆనంద భాష్పాలు రాల్చే తల్లై ఆమె మరిసిపోతుంది.
పెత్తందార్లంతా విలాసవంతమై ఉష్ణపు గదుల్లో
నులివెచ్చని ఆనంద డోలికల్లో ఓలలాడుతూ
గ'మత్తు'లో తేలియాడుతూంటే-
ఆమెతో పాటు ఆమె సహచర చెత్తందార్లంతా
నగరం నిర్లజ్జగా విసర్జించిన
మలమూత్రాల్ని శుభ్ర పరిచేందుకు
నిద్ర కళ్లకు కనురెప్పుల్ని నిటారుగా కాపలాపెట్టి
శ్రమిస్తూ చెమటను చిందిస్తుంటారు
వారి మెడలో మంగళసూత్రాలు
గుది బండలై వేలాడుతుంటాయి
వాటిని కట్టినోడు, వాళ్లను కట్టుకున్నోడు
పీకలదాకా సారాని మనసారా నింపుకుని
ఏ చెత్తకుండీ చెంతనో
ఏ మురికి కాల్వపక్కనో
పందిలా పొర్లి పెనిమిటిగా తన బాధ్యతనే కాదు
ప్రపంచాన్నే మరచి మొద్దు నిద్ర పోతుంటాడు
వాడితో ఏడడుగులు నడిచిన తలరాతకు
తాళిబొట్టుకూ తలవొంచి
వాళ్లంతా అమ్మలుగా మారి
వారి మూడు ముళ్ల బంధాలను
సురక్షితంగా యిళ్లకి చేరవేస్తుంటారు
'భరించేవాడు భర్త' అనేది
మగబుద్ధి మెదడుకి మేతపెట్టిన సామెతేమో?!
ఎందుకంటే అప్పటికీ, ఇప్పటికే కాదు
మరెప్పటకీ భరించేది భార్య మాత్రమే
భర్తనే కాదు 'బాధలను, బరువులను, బాధ్యతలను కూడా....
(పారిశుద్ధ కార్మికులైన అమ్మలకు, అక్కలకు అభిమానంతో...)

# వర్తమాన కవితా ప్రస్థానంలో - కెరెజగదీష్ రాత్రిసూర్యుడు !




- డాక్టర్ రాధేయ
9985171411

మహాకవి గురజాడ ఏనాడైతే సాహిత్య చరిత్రలోకి మనిషిని రికార్డు చేశాడో, ఆతర్వాత ఆయన అడుగుజాడలో నడిచిన శ్రీశ్రీ ఆ మనిషి చరిత్రను విశ్వవ్యాప్తం చేసి మానవుడే నా సందేశం అంటూ కవితా జెండాను గర్వంగా ఎగురేశాడు. కవిత్వం ఆధునికమయ్యాక వస్తురూపాల పట్ల ఎలాంటి నియంత్రణలూ లేవు. వర్తమానకవికి కవితా నిర్మాణంపట్ల ఎటువంటి నిషేధాలు లేవు. ఆ కవి ప్రతిభ వస్తువును కవిత్వం చెయ్యడంలో వెల్లడవుతుంది. ప్రతిభలోపిస్తే శుద్ధ వచనమై పేలవంగా వుంటుంది.

ఒక జర్నలిస్టు కవిగా మారవచ్చు. కవులు జర్నలిస్టులుగా మారిన సందర్భాలు అరుదు. జర్నలిస్టులో వచనం, వాస్తవమై వుంటుంది. కవిలో అనుభూతి, కల్పన అదనపు అకర్షణలుగా వుంటాయి. ఈ నేపథ్యంలోంచి చూస్తే రాయలసీమకు చెందిన అనంతకవి కెరె జగదీష్ తన సుదీర్ఘ పాత్రికేయ జీవితాన్ని కవిత్వంగా మలుచుకుంటున్న ప్రతిభావంతుడని చెప్పవచ్చు. జగదీష్‌తో నాకు ఇరయ్యేళ్ళ పరిచయమున్నా, ఆయనొక కవితాభిమానిగా, జర్నలిస్టుగానే నేను గమనించాను. ఆయన నిఖార్సయిన కవిగా గుర్తింపు కొచ్చింది ఈ రెండేళ్ళ లోనే. 2011లో 'సముద్రమంతగాయం' అనే పేరుతో కవిత్వం ప్రకటించాడు. ఇందులో తన అనుభవాలను సంఘటనలుగా, వేదనాభరితంగా కవిత్వీకరించాడు. ఇందులో కవిత్వం పాలుకంటే 'వచనం పాలు' ఎక్కువని నాకనిపించినా, తర్వాత ఇటీవలె 'రాత్రి సూర్యుడు' పేరుతో 'ప్యూర్ పొయిట్రీ'ని ప్రకటించాడు.

అందులోనూ అంధుల చీకటి లోకాన్ని ఆవిష్కరించిన తీరు, సమకాలీన ప్రపంచంలో వారి వేదనామయ ప్రపంచాన్ని దీర్ఘకావ్యంగా రాయడంలో సఫలీకృతుడైనాడు. ఎవరూ స్పృశించని వస్తువును తీసుకొని, ఆ వస్తువును గురించి అనేకకోణాల్ని ఆర్ద్రంగా, ఔచిత్య భరితంగా చెప్పడం ఈ 'రాత్రి సూర్యుడు' కావ్య విశేషం.

వేదనలోంచి వచ్చే కవిత్వంలో 'ఆర్ద్రత' కలిగి వుంటుంది. కన్నీటిని హృదయం మీటినప్పుడే కవిత్వం పుడుతుంది. ఈ మానసిక వేదన 'రాత్రి సూర్యుడు'లో తీవ్రంగా కనిపిస్తుంది. అందమైన ప్రపంచానికి దూరమై అంధత్వపు చీకటిలోయల్లో తడారిపోతున్న అంధులంతా రాత్రి సూర్యుళ్ళే! నెల్లూరులోని కవి మిత్రుడు, నవలా రచయిత తన 21వ ఏట 'గ్లకోమా' వ్యాధితో కంటిచూపు కోల్పోయిన వాడు కానీ తన చుట్టూ గొప్ప ఆత్మ విశ్వాసంతో సాహిత్యాన్ని నిర్మించుకున్నాడు.

ఈ రాత్రి సూర్యుడు అక్షర నేత్రంతో వెలుగులు విరజిమ్ముతున్నాడు. కెరె జగదీష్ ఈయన్ను స్ఫూర్తిగా తీసుకున్నాడు అంధుల పట్ల ప్రేమను పెంచుకొని అక్షర సూర్యుళ్ళను రాత్రి సూర్యులుగా పరిచయం చేస్తున్నారు.

వెలుగు చినుకులతో తడిసి
చూపుల మేఘాల దాగుడు మూతలలో
ఉదయించాల్సిన కనుపాపలు
సంధ్యా చీకట్ల కౌగిలిలో
కన్నీటి తరంగాలు (పేజి.33)

ఈ చీకటి సూర్యుడు మాతృగర్భంలోంచి బయటపడడంతో ఈ దీర్ఘకావ్యం ప్రారంభమవుతుంది. ఆ కనుపాపల్లో చీకటి జలపాతం కలవరపెడుతున్నా లెక్కచెయ్యని ఆత్మవిశ్వాసం అమాయకంగా నవ్వుతూనే వుంటుంది. కన్నీటి తంత్రులను మీటిన ఆ హృదయం కవనగానం చేస్తుంది.

దుఃఖాన్ని కౌగిలించుకున్న కనురెప్పలు
కన్నీటిధారలకు
కాంతి రేఖలను అతికించుకుని
ఎడారిలో ఒయాసిస్సులవుతాయి (పేజి 39)

మొక్కవోని ఆత్మ బలం మాది. ఎన్నడూ మా అడుగు ముందడుగే

కవిత

# ఫిక్సింగ్

-పొత్తూరి సుబ్బారావు
9490751681



అడిగిన అభిమానులందరికీ
ఆటగాళ్ళిపుడు ఆటోగ్రాఫ్‌లిస్తారనేది
అనుమానమే
అడిగినంతముట్టచెప్పే
బుకీలకు మటుకు
అడిగిందే తడవుగా
ఆటనంతా రాసిస్తారు
అన్ని రంగాలలో
ఆవరించిన భ్రష్టత్వమిపుడు
మన క్రికెట్‌లోనూ అవతరించింది
అది బౌలర్ల చేతుల్లో పడగా
దాన్నే బంతిగా మలచి విసరగా
అవతలి ఆటగాడు కొట్టే సిక్సర్ల ధాటికి
సిన్సియారిటీ ఎటో పారిపోయింది
మాయాజూదం
మహాభారతంలో రాజ్యమేలినట్లు
మాయగాళ్ళ ఆటే
నేటి భారత్‌ను శాసిస్తున్నది
అంతా మార్కెట్ మయమయినపుడు
ఆటలకు మాత్రం మినహాయింపెందుకుంటుంది
దోచుకునేవారికెపుడూ
అందుబాటులో వుండేది అతి సామాన్యులే
అందుకే అక్కడే ఫిక్సింగ్ అయితే
ఇక్కడ బెట్టింగ్ అవుతున్నది
మాయలోపడి ఇళ్ళు ఒళ్ళు
గుల్లచేసుకొనే జనం
ఇంకెన్నోళ్ళు చెల్లిస్తుంటారు ప్రీమియంని
ఈ ఇండియన్ ప్రీమియంలీగ్‌కి
తప్పదుమరి ఫిక్సింగ్ ఆటను చూడటానికి
జనం ఫిక్స్ అయినంతకాలం.

---

అంగ వైకల్యం మా శరీరానికే మనసుకు లేదు. ఈ సమాజంలో కళ్ళున్న అంధులు ఎంతమంది లేరు?

అన్ని ప్రశ్నించే రాత్రి సూర్యుళ్ళకు ఏం సమాధానం చెబుదాం?

ఆ హృదయాలను / తడిమి తన్మయత్వం చెందడం
ఒక దయనీయం / దిగంతాలలోకి జారిపో
తున్న ఆ దయనీయ దృశ్యాలను / హృదయానికి
హత్తుకోవడం / మానవీయతకు దర్పణం / (పేజి. 47)

ఆ చేతుల రెక్కలకు కళ్ళను అతికించుకొని అడుగులు వేస్తుంటే కన్నీటి జలపాతమే దూకుతుంది. ప్రయాణం భారమైనప్పుడల్లా జ్ఞాపకాలు సూదులై సులువుతుంటాయి. ఈ అంగవైకల్యం శరీరానికే కదా మనసుకు లేదు కదా అనుకునప్పుడల్లా ఒక గొప్ప ఆత్మ స్థైర్యం రాత్రి సూర్యుని తలపై కిరీటమై ధగధగ లాడుతుంది. కవిత్వమై రెపరెపలాడుతుంది.

"కలలను దోచుకున్న ఆ గాయం
కవిత్వమై నవ్వుతుంది"

కంటిచూపు రెక్కలొచ్చి ఎగిరిపోతే దృశ్యాలన్నీ వలయాలుగా గిరికీలు కొడుతుంటాయి. అడుగులు తడబడతాయి నిలువెల్లా ఆవరించిన మహాశూన్యంలో ఒకే దృశ్యాలు.. దృశ్యాలు

కనురెప్పల చుట్టూ దృశ్యాలు
కలలు కలలుగా దృశ్యాలు
గుండె నిండా దాగిన దృశ్యాలు
వెంటాడి, వెంటాడి
ప్రతిక్షణం వేదిస్తూనే వుంటాయి (పేజి. 57)

నిశ్శబ్దమైన చీకటిలో దుఃఖించడమైనా, ప్రేమించడమైనా చీకటిలోనే, ఒంటరిగానే అయినా ఓదార్చలేని ఒక భుజం కావాలి. ఆ చేతిని తన చేతిలోకి తీసుకొని రోడ్డును దాటించాలి.

కనుబొమ్మలను గీసిన చిత్రకారుడు
తన కుంచెతో కనుపాపలను చిత్రిస్తూ
నల్లని రంగును ఒలకబోశాడు (పేజి. 73)

బ్రెయిలీని ప్రేమగా తడుముతూ తడబడితే మానసిక ఆకాశంలో వెలుగు పక్షులు రెక్కలు విప్పుతాయి అక్షరకాంతులు దేహమంతా వ్యాపిస్తాయి స్వప్నాలను సాకారం చేసుకునే దిశగా అనంతమైన విశ్వాసం విశ్వంభరపై విజయపతాకం ఎగురవేస్తుంది.

'హెలన్‌కెల్లర్, స్టీవ్‌వండర్, జాన్‌మిల్టన్
చిలకమర్తి లక్ష్మీనరసింహం, రవీంద్రజైన్
ద్వారం వెంకటస్వామినాయుడు, పుట్టరాజగవామ్
బుడిగి శ్రీనివాసులరెడ్డి ఇలా.. ఎందరెందరో
కీర్తి కిరీటాలు ధరించి చీకటి రాజులయ్యారు
చీకటి చరిత్రాకాశంలో ధ్రువతారలుగా మిగిలారు" (పేజి. 89)

ఇలా రాత్రి సూర్యుడే దయనీయ చరిత్రను కరుణరసంతో ఆర్ద్రంగా చిత్రించిన జర్నలిస్టు కవి కెరె జగదీష్‌ను ఈ దీర్ఘకావ్యం చదివిన ప్రతి పాఠకుడూ అభినందించాలి. అది నైతిక బాధ్యత కూడా.



# ఆలోచనాలోచనాలు, స్వామి కథలు




- డా॥ డింగరి నరహరి ఆచార్య
9866650184

ఈతరం కథకుల్లో ఎదుగుతున్న కథా రచయిత డా॥ బి.ఎస్.స్వామి. 'నెలపొడుపు' (కథాసంపుటి) నుండి "రాత్రి, పగలు ఒక మెలకువ" దాకా ఇంతింతై ఎదిగి ఒక ఉన్నత శిఖరాన్నందుకొన్న నేటి తరం రచయిత. ఆయన ఒక దార్శకునిడు. సమస్యను కూలంకషంగా అర్థం చేసుకొని ఒక పరిష్కారమార్గాన్ని చూపాలనే తాపత్రయపడే భావుకుడు. జీవన మార్గంలో తాను చూసిన పలు సంఘటనలకు సంచలించి పోయి, వాటిని కథాత్మకంగా సమాజం ముందు నిలిపి ఆలోచన చేయించగల సత్తావున్నవాడు. అందుకే ముందుమాటలో డా॥ కాత్యాయని విద్మహే సరిగ్గా "సంవేదనాశీలి కథలు" అన్నారు.

రచయిత ప్రతికథను అనుభవించి వేదనతో రాసాడన్నది నిజం. ఇందులోని కథల్లో విద్యా వ్యవస్థ, దానిలోపాలు, ప్రజా ప్రయోజనమనుకొని ప్రభుత్వం ప్రవేశపెట్టిన పథకాలు ఎలా విఫలమవుతున్నాయో కళ్ళకు కట్టినట్టు చూపాడు. కుంపటి కథలో పల్లెలు మారిన క్రమం, కుత కుత కుమిలిపోతున్న జన జీవితాల్ని చిత్రికపట్టాడు. ఉద్యమాలు, బందులు, ఒడిదుడుకులతో సాగుతున్న నేటి సమాజాన్ని 'వర్తమాన చిత్రపటం"గా మలిచాడు. ఇందులో ప్రతి అంశాన్ని పొందికగా తీర్చిదిద్దాడు. చచ్చినవాణ్ణి సాగనంపడం కోసం బ్రతికున్నవాడు సమకూర్చే సంభారాలు, వాటికోసం వాళ్ళుపడేపాట్లు, "చావు ప్యాకేజీ' కథలో కనపడుతుంది. ఈ కథలో ఒక కొత్త వృత్తి పుట్టుకను పాఠకులు గమనించవచ్చు. "మరణం ముంగిట్లో" కథలో ఉద్యమంలో పాల్గొన్న తరం పోగొట్టుకున్నదేమిటో, చదువు లేకపోయినా, నేటితరంతో పోలిస్తే వీళ్ళెలా పెద్దతరహాలో ఆలోచించగలరో తెలిపాడు. ఈ కథలోని ముగింపు కథకు పరాకాష్టను ప్రసాదించింది. చేనేత జీవితాలూ, తాగుడుకు బానిసలు కావడానికి కారణాలు 'కుంఠనం'లో కనపడతాయి. తెలంగాణ మాండలికంతో, గేయరీతులతో, జాతీయాలు, సామెతలతో వారి జీవనచిత్రాలను, భావచిత్రంగా మార్చిన రచయిత శైలిని అభినందించక తప్పదు. "ఇనుప తెరల మధ్య" ఎల్లవ్వ జీవితం అంచెలంచలుగా ఎదిగిన వైనం అద్భుతంగా చిత్రించాడు. అబలగా కాక సబలగా మగరాయుడు చేసినట్లు పనులు చేసికుంటూ, తాగుబోతు మగని ద్వారా కష్టాలు పడుతూ జీవన ప్రవాహానికి ఎదురీదడం, పల్లెల్లో కనిపించే ఆడపడుచుల జీవితానికి అద్దంపట్టే కథ. రాత్రి పగలు ఒక మెలకువలో బీడీ కార్మికుల జీవితాలు వివరిస్తూనే, ఆ పరిశ్రమలవల్ల కలుగుతున్న లాభనష్టాలను పాత్రల ద్వారా రచయిత ఎంతో సమర్థవంతంగా నిర్వహిస్తూ, పాఠకునిలో ఆలోచనలను రేకెత్తిస్తాడు. ప్రేమ పేరుతో కాని, మరోరకంగా కాని స్త్రీల మీద యాసిడ్ దాడులు, గొంతుకోయడాలు మొదలైన అరాచక శక్తుల ద్వారా జరిగిన అమాయక అబలల మరణాలను చర్చిస్తూనే ఎవరు వీటికి పరిష్కారం చూపగలరన్న ప్రశ్నను సంధించినట్లున్న కథ గాజు పెంకులు - దూదిపింజలు. ఈ విధంగా అనేక సమస్యలను ముందు పరచుకుంటూ పోతూనే, అధ్యాపకవృత్తిలో ఉన్న ఈ రచయిత బళ్ళలో జరిగే మధ్యాహ్న భోజన పథకాల అస్తవ్యస్తతను, ప్రభుత్వం ఎన్ని పథకాలు ప్రవేశపెట్టినా టీచర్స్‌లో గల ఉదాసీనత పోనివాడు అవన్నీ వ్యర్థమేనని నిర్భయంగా ప్రకటిస్తాడు. ర్యాంకుల పోరాటంలో నలిగిపోతున్న విద్యార్థితరం అంతరంగ మథనాలను, మరణాలను ఆవిష్కరిస్తూ బడిలో తీసుకరావాల్సిన అనేక చర్యలను ఉటంకిస్తూ నాలుగైదు కథలు అద్భుతంగా మలచబడ్డాయి.

ఈ రచయిత ఏ కథను తీసుకున్న దాన్ని సముద్ర మథనం చేసినట్టుగా పలుకోణాలను దర్శింపజేసి చివరకు అమృతం సాధించే ప్రయత్నం కనిపిస్తుంది. కనీసం పాఠకుడు హాలాహాలానికి చేరువకాకుండా చూసే జాగృత్త అగుపడుతుంది. ఆయా సన్నివేశ చిత్రణకు ఉపయోగించిన శైలి, భాష, ఒక అనుభవశీలియైన రచయితలోని నేర్పరితనాన్ని గుర్తుకు తెస్తుంది. ఏదో ఒక కథ రాయాలనే తపన కన్నా, ఏ కథలోనైనా సమాజంలో మార్పు రావాలనే కోరిక కనిపిస్తుంది. ఈ కథలన్నీ ఏకబిగిన రాసినవి కావు. జరుగుతున్న యథార్థ సంఘటనలను పాఠకులు మనస్సులో ముద్రించి, ఆలోచనలు రేకెత్తింపజేయడంలో రచయిత సఫలీకృతుడైనాడు. మరిన్ని మంచి ఆలోచనలను భావిలో మన ముందుకు తెస్తాడని ఆశిద్దాం.



## కవిత

# ఏది ! ఆ జనపదం ?

- రెడ్డి శంకరరావు

9494333511

ముద్దబంతి పువ్వులా
నిత్య యవ్వన సౌందర్యంతో
ముత్యంలా మెరిసే
స్వచ్ఛమైన మణిపూసలాంటి
నా పల్లెంటే నాకిష్టం

దుష్టశిక్షణా
శిష్ట రక్షణకై
నిత్యాన్వేషణ చేసే
రచ్చబండని శిరస్సును మోసే
ఊడల మర్రి
ఊసులంటే మరీ మరీ ఇష్టం

ప్రశాంతతకు ప్రతీక
మత సామరస్య పతాక
గుడిని సిగలో పెట్టుకుని
మసీదును అక్కున చేర్చుకుని
చర్చిని చేతుల్లో పట్టుకుని
కొబ్బరి చెట్లను
చీరలా చుట్టుకున్న
కోనేరు గట్టంటే చాలా ఇష్టం

భూబకాసురుల కబంధహస్తాల నుండి
విడివడి వృత్తిలన్నీ వికసించీ
వినీలాకాశంలో చుక్కల్లా
నిత్యం వెలుగుతుండాలనే
నా ఆశలన్నీ...
ఒక్కసారిగా పేకమేడలై కూలిపోయాయి

నా ఇష్టాలన్నీ... కష్టాలయ్యాయి...
ఓ స్వప్నం... ఓ జ్ఞాపకం
ఓ చరిత్రగా నిలిచిపోయే క్షణం
అందానికి ప్రతిబింబమైన పల్లె
వల్లకాడైన వేళ....
ఆహ్లాదాన్ని పంచే
పైరు గాలి, సెలయేరు
విషతుల్యమై...

సంక్రాంతి భ్రాంతై
చీకటి స్మశాన వాటికలా
దహనమైన వేళ
అంగుళంగుళం అనర్థమై
నిన్న నన్ను కన్న పల్లె తల్లి
నేడు దూరపు బంధువైంది.
శిశిరంలో చీకటిలో
వాకిటిలో ఒంటరిలో
నన్నే అక్కున చేర్చుకుని
ఆలింగనం చేసుకున్న పల్లె...

పరిశ్రమాధిపతుల
లాభాల వేటకు బలై
బ్రతుకుచెడి
ప్రపంచీకరణ ప్రపంచంలో
మార్కెట్‌శక్తుల మృత్యువుకౌగిట్లో
బంధీ అయి
కాలం వెళ్లదీస్తుంది !



నాకు దూరంగా
నన్ను పట్టుకోకుండా
నేను ముట్టుకోకుండా
ఒంటరిగా ఎడారిలో ఒంటెలా
జీవచ్ఛవంలా
కాలం వెళ్లదీస్తున్న పల్లెలో
ఉషోదయపు వెలుగులకై
ప్రజలు ప్రళయ భీకరమై
తిరగబడ్డారు
కన్నీటి ప్రవాహం
పెనుసునామిలా విరగబడింది

ఇపుడు పల్లె
ఓ కొత్త వెలుగుల ప్రస్థానంకై
పరుగులు తీస్తుంది.

---

# రాజకీయం

- పారువెల్ల

కీసలో కాసులెందుకురా
అంగట్లో అన్నీ ఉచితాలేనట
సేవలు త్యాగాలు ఊతపదాలే
పాలకులంతే ఏ పాపం మూటగట్టుకోరు

సంధి చేసుకున్నా
సంచి పంచుకున్నా
అమ్మేది నిన్నూ నన్నే
అడ్డా చేరుకున్నాక మొహమాటాలేముంటాయ్
పాలకులంతే ఏ పుణ్యం వదులుకోరు

రాజకీయమంటే అంతే
సమాధి మీద పూచిన శ్వేత మందారంలా



చావు పాటల పైనే పూస్తుంది యువ రాజకీయం

వాడుపోతే కొందరు చచ్చారని
వీడు పోతే కొందరేడ్చారని
ఇక్కడ చావు లెక్కలూ... దొంగ లెక్కలే
ఇంటోళ్ళకి ఏమీ కాదు
చంటోళ్ళది చావులెక్కల సన్నాయి మేళం !
వీధి వీధి తిరిగి వాయిస్తుంటారు

వాళ్ళు,
అసలు లెక్కలు దాస్తున్నారు
చావు లెక్కలు మోస్తున్నారు

# కొత్త పుస్తకాలు

## స్త్రీ అక్షరాలు శిలాక్షరాలు

వ్యక్తిత్వ వికాస పురోగమనం

- దేవరాజు మహారాజు

వెల : రూ.150/- పేజీలు : 150

ప్రతులకు : 9908633949

భాషలు, ప్రాంతాలు, సంస్కృతులు వేరైనా అందరూ కొన్ని మౌలిక సూత్రాలను అనుసరించి రచనలు చేసినవారే, చేస్తున్నవారే. ఒక విశాల ప్రాతిపదిక మీద, భారతీయ జీవన ఔన్నత్యాన్ని, ప్రపంచానికి చాటిచెబుతున్నవారే. విభిన్న పార్శ్వాల నుంచి జాతీయ సమైక్యతకు దోహదం చేస్తున్నవారే. వ్యక్తిత్వ వికాస పురోగమనం భారతీయ రచయిత్రుల విజయ కేతనం

- ప్రచురణకర్త

## సౌందర్య సృజన

చిత్రకళా వ్యాసాలు

- ఎల్.ఆర్. వెంకటరమణ

వెల : 80 - పేజీలు : 144

ప్రతులకు : 9866158908

ఈ వ్యాసాలు చదువుతుంటే రచయిత జీవన దృక్పథం, సౌందర్య దృష్టి, సృజనాత్మక ఆలోచనా రీతి బోధపడతాయి. వెంకటరమణ అధ్యయనంలోని విస్తృతి ఈ వ్యాసాల్లో ప్రతిఫలిస్తుంది. తెలుగు, ఆంగ్ల సాహిత్యాల్ని చదువుకోవడం, చిత్రకళా చరిత్రను ప్రత్యేకంగా అభ్యసించడం, కొత్తగా చూసే దృష్టిని అలవరుచుకోవడం కారణంగా ఈ వ్యాసాలకు నిండుదనం వచ్చింది.

- గుడిపాటి

## కథాకాశం

- ఎల్.ఆర్. స్వామి

వెల : రూ.60/- పేజీలు : 112

ప్రతులకు : 040-27678430

2006 నుంచీ 2012 దాకా స్వామి రచించి ప్రచురించిన పదమూడు పెద్ద కథలు, మరో ఆరు మినీ కథలనొచ్చేమో, అవీ వెరసి పంధోమ్మిది కథల తాజా సంపుటి ఇది. రచయితగా స్వామి పరిణామక్రమాన్ని తెలియచేసే కథలివి. ఏ కథకుడి రచనయినా దేశ కాలాదులను చిత్రిస్తుంది కాబట్టి ఆ మేరకు 2006-2012 మధ్య వచ్చిన మార్పులు కూడా ఇతివృత్త పరిమితులకు లోబడి స్వామి ఈ కథల్లో చిత్రించారని గమనిస్తాము.

- రామతీర్థ

## మృత్యుమోహనం

- డా॥ శ్రీలత

వెల : రూ.50/- పేజీలు : 104

ప్రతులకు : 040-27678430

"మృత్యుమోహనం" కావ్యంలో శ్రీలత మరణం గురించిన ఆలోచనలు మన ముందుంచారు. జీవితాన్ని గురించి అందరూ ఆలోచిస్తారు మరణం గురించి ఆలోచించటమే అపూర్వం. అసలిలా ఆలోచించడానికి కూడా ఆత్మబలం వుండాలి. ఎవరో అన్నట్టు "జీవితంపై మనకున్న అభిప్రాయం మరణంపై ఉన్న అభిప్రాయంపై ఆధారపడి ఉంటుంది" నిజమే శ్రీలత స్థితప్రజ్ఞత్వానికి ఈ కావ్యం మచ్చుతునక.

- డా॥ ద్వానా. శాస్త్రి

## ధమ్మపదం

- అనుసరణ

సుగమ్‌బాబు

వెల : రూ. 60/- పేజీలు : 123

ప్రతులకు : 8096615202

స్వీయవాదాలకు అనుగుణంగా మూలార్థాన్ని సమన్వయం చేసిన వారు కూడా ఉన్నారు. కాని వీరందరికి భిన్నంగా సుగమ్‌బాబు ధమ్మపదాన్ని సరళ సుబోధకంగాను ధారాశోభితంగానూ, బుద్ధుని అంతరంగం మనముందు చక్కగా ఆవిష్కరింపబడే విధంగానూ కవిత్వీకరించారు.

- ఆచార్యమసిసన చెన్నప్ప

## ఆత్మ ని'వేదన'

- కవితా సంపుటి

- ఆత్మీయ నిర్మల (లక్కరాజు)

వెల : 200 పేజీలు : 115

ప్రతులకు : 9949299618

ఈ సంపుటిలోని కవితలను పరిశీలిస్తే శ్రీమతి నిర్మల కవితా ప్రతిభ క్రమక్రమంగా అంతర్ముఖీనంగా పరిణమిస్తున్న విషయం తెలిసిపోతుంది. చుట్టూ ఉన్న సమాజాన్ని సూక్ష్మంగా పరిశీలిస్తూనే అంతరంగం పొరల్లోకి తొంగి చూసే తాత్విక దృక్పథం శ్రీమతి నిర్మలకు అలవడింది.

- సినారె

# కొత్త పుస్తకాలు

## న్యూయార్క్ కథలు



- కూనపరాజు కుమార్

వెల : రూ. 95/- పేజీలు : 130

ప్రతులకు : 9989999599

నా అనుభవాలు, ఆలోచనలు అంతర్లీనంగా ఈ కథలలో వున్నాయి. ఇది నా మొదటి పుస్తకం. మీరు అభిప్రాయాలను సూటిగా తెలియజేస్తే, నాకు ఎంతో సహాయం చేసిన వారవుతారు. ఈ పుస్తకంలోని అన్ని కథలు గత నాలుగు సంవత్సరాల నుంచీ వ్రాసినవే.

- కుమార్ కూనపరాజు

## గురజాడ దర్బార్




(ఆధునిక సాహితీ రూపం)

- ద్వా.నా. శాస్త్రి

రూ. 30/- పేజీలు : 32

ప్రతులకు : 040-27426666

ఈ రూపక ప్రణాళిక రాళ్ళబండివారిదే. "మీరు రాయగలరు" అని ప్రోత్సహించినదీ వారే. ఈ రూపకం విజయనగరంలో, హైదరాబాద్ రవీంద్రభారతిలో ప్రదర్శించినప్పుడు లభించిన ప్రశంసలు అన్నీ ఇన్నీ కావు. ఇవన్నీ కవితాప్రసాద్‌కే చెందుతాయి. ఇటీవల ప్రపంచ తెలుగు మహాసభలలో ప్రదర్శించినప్పుడు కూడా మెప్పు పొందింది.

- ద్వా.నా. శాస్త్రి

## ప్రవహించే పాదాలు



మంత్రి కృష్ణమోహన్

వెల : రూ.60/- పేజీలు : 95

ప్రతులకు : 9441028186

కవికి వస్తుబలంతో పాటు చక్కని శైలి కూడా వుండాలి. శైలి కవి భావ విధానంలో ఒక భాగమైనప్పుడే అతనికి బలమైన అభివ్యక్తి సమకూరుతుంది. సరిగ్గా అటువంటి ప్రయత్నంలో వున్నవాడు మన మంత్రి కృష్ణమోహన్, గుండెల నిండుగా ఉన్న సంవేదన వల్ల, అలవికాని అశాంతి వల్ల, సానపెట్టుకుంటున్న సాధన వల్ల, అన్నింటినీ మించి లోకంపట్లా, మనిషిపట్లా ఉన్న అపారమైన ప్రేమవల్ల ఇతని కవిత్వం ఆర్ద్రంగా, బలంగా, స్ఫూర్తిదాయకంగా, సురుచిరుమౌక్తికంగా రూపొందుతున్నది.

- డా॥ ఎన్.గోపి

## జీవన చిత్రాలు



(వచన కవిత్వం)

కూర చిదంబరం

వెల : రూ.30/- పేజీలు : 45

ప్రతులకు : 984878430

మనుష్యుల మధ్య ఉన్న బంధాలు, అనుబంధాలు, ప్రకృతితో సహజీవనం, జీవితంలో భాగమైన చెట్లు చేమ.. తన గురించి తాను, తన ఆలోచనలు... అన్నింటిని అందరితో పంచుకోవాలన్న తపన చిదంబరం చిన్న పదాల్లో కన్పిస్తుంది. మనస్సుకు ఆలోచనలను, ఆవేదనను, ఆనందాన్ని కలిగించే చిన్న "సంక్షిప్తాలు" ఇవి.

- డా॥ విష్ణు వందనా దేవి

## దళిత బహుజన సాహితీవేత్తలు



సాహిత్య నిర్మాతలు

బి.ఎస్. రాములు

వెల : రూ. 100/- పేజీలు : 184

ప్రతులకు : 8331966987

ప్రధానంగా వీరంతా సాహిత్యం, సామాజిక న్యాయం, సామాజిక మార్పు కోసమే అని నమ్మి తమ తమ రంగాల్లో కృషి చేసిన, చేస్తున్న ఉద్యమ కవులు, రచయితలు, కళాకారులు. ఈ పీఠికలను, వ్యాసాలను ఆయా రచయితలతో గల స్నేహం, ప్రేమ, గౌరవంతో పాటు దరకమే ఐక్యవేదిక ఉద్యమం, నిర్మాణం, విస్తరణ మేళవించి ఆత్మీయంగా రాసినవి.

- బి.ఎస్. రాములు

## కార్టూయి



కవిత్వం

- డా॥ దామెర రాములు

వెల : రూ.70/- పేజీలు : 192

ప్రతులకు : 09866422494

భాషలో, భావంలో కొత్తదనం, సూటిదనం, స్పష్టత వున్నాయి. వస్తువులో వైవిధ్యం, వ్యక్తీకరణలో సారళ్యం మిళితమై రాములు కవిత్వాన్ని పాఠకులకు సుబోధకం చేశాయి. అందువల్లనే ఈ కవిత్వం మరింత మంది పాఠకులకు చేరువ అవుతుంది. తమ లోలోపలి ప్రపంచాలని శుభ్రం చేసుకోడానికి తోడ్పడుతుంది.

- గుడిపాటి

# రచయితలకు విజ్ఞప్తి

యు.జి.సి అందించిన ఆర్థిక తోడ్పాటుతో **'ప్రజా వాగ్గేయ సాహిత్యం – పర్యావరణ తత్వం'** అనే అంశంపై అధ్యయనం సాగుతున్నది. పర్యావరణ సమస్యలను సంక్షోభాలను, ఇతివృత్తాలుగా చేసుకుని రాసిన మీ గేయసాహిత్యం ఈ ప్రాజెక్టులో భాగంగా అధ్యయనం చేయబడుతుంది. ఇందుకు మీ సహాయం, తోడ్పాటు ఎంతగానో అవసరం. పర్యావరణ స్పృహ, చైతన్యాలతో మీరు రాసిన గేయాలు / పాటలు / తదితర సమాచారాన్ని సేకరించి భద్ర పరచవలసి వుంది. పర్యావరణ విషయంగా మీ సంవేదనలను, అవగాహన, చైతన్య, దృక్పథాలను విశ్లేషించేందుకు వీలుగా మీ గేయాలను పంపవలసిందిగా మనవి. ప్రజావాగ్గేయ కారులుగా మీ కృషిని భావితరాలకు అందించే సంకల్పంతో మీ గురించి సమాచారాన్ని సేకరిస్తున్నాను. మీ బయోడేటాతో పాటుగా, జతపరచిన ప్రశ్నావళికి సానుకూలంగా సమాధానాలు ఇచ్చి తిరిగి ఈ ప్రశ్నావళిని పంపవలసిందిగా మనవి.1. పర్యావరణం గురించి రాయడానికి ప్రేరణ ఏమిటి 2) ఎప్పటి నుండి రాస్తున్నారు? 3) పర్యావరణ విషయంగా తొలిగేయం ఇతివృత్తం. 4) పర్యావరణం గురించి రాసిన గేయాల సంఖ్య. 5) పుస్తక ప్రచురణ జరిగిందా? వివరాలు? 6) మీరు ఇతర వాగ్గేయ కారులతో కలిసి సి.డిలు ప్రకటించారా ? 7) మీ గేయ రచనలకు జానపద బాణీలను ప్రయోగించారా ? వివరాలు 8) వచన కవిత్వ / కవుల ప్రభావం మీ మీద ఏమైనా ఉన్నదా ? 9) మీ గేయ సాహిత్యం గురించిన వ్యాసాలు ఏమైనా వచ్చాయా ? 10) మీ సాహిత్యం గురించి విమర్శనాత్మక విశ్లేషణ జరిగిందని భావిస్తున్నారా ? 11) ప్రదర్శనలు ఇస్తే స్థూలంగా సంఖ్య 12) ప్రదర్శన సందర్భం, రాజకీయ ఉద్యమం, సామాజిక చైతన్యం, ప్రభుత్వ పథకాలకు సంబంధించి, ఇతరం 13) ఏయే ప్రాంతాలలో మీ ప్రదర్శనలు సాగాయి ? 14) అభివృద్ధి, ప్రగతి, సంస్కృతి, నాగరికతల గురించి సందేహాలు మీ గేయాల్లో వ్యక్తం చేశారా? 15) పల్లెల విధ్వంసం – వలసల గురించి రాశారా? వాటి వివరాలు... 16) పట్టణీకరణ గురించి రాసినవి. 17) గేయానికి వస్తువు, దృక్పథాలను ఎట్లా ఎంచుకుంటారు? 18) గ్లోబల్ వార్మింగ్, జీవవైవిధ్యం, ప్రకృతి వైపరీత్యాల గురించి రాసినవి? 19) ఇతర జీవరాశుల ప్రస్తావన మీ గేయాల్లో పోలికలుగా, ఉపమానాలుగా మెటాఫర్‌గా వాడారా ? 20) ఆధునిక తెలుగు సాహిత్యాన్ని పర్యావరణ దృష్టికోణంలో అంచనా వేయాల్సి వుందని భావిస్తున్నారా? ఎందుకు? 21) ప్రకృతి విధ్వంసానికి మానవ కార్యకలాపాలే కారణం అనే వాదాన్ని అంగీకరిస్తారా? 22) ప్రకృతిలో భాగంగా సహజీవనం / సమజీవనం పై మీ అభిప్రాయం ? 23) మీ గేయ సాహిత్యం ద్వారా వ్యక్తమైన తాత్వికత ఏమిటి? 24) ప్రకృతి / పర్యావరణ సమస్యలపై పాడిన గేయాలకు ప్రజా స్పందన ఎలా వుంది. 25) స్థానికంగా మిమ్ములను ప్రభావితం చేసిన జానపదగాయకులు లేదా పాటలు 26) పర్యావరణంపై రాసిన అముద్రిత గేయాలు మీ వద్ద ఏమైనా ఉన్నాయా?

తెలుగు సాహిత్యంలో ప్రజావాగ్గేయకారులుగా ప్రసిద్ధులైన వారు ఈ అంశంపై స్పందించి విలువైన సాహిత్యం సృష్టించిన సంగతి మీకు తెలిసిందే. పర్యావరణ దృష్టికోణం నుంచి సృజించబడిన ఈ వాగ్గేయ సాహిత్యం గురించి అంతగా అధ్యయనాలు జరగలేదు. ప్రకృతి, పర్యావరణం, వనరుల విధ్వంసం, వైపరీత్యాలు, వలసలు పట్టణీకరణ, పెరుగుతున్న జనాభా, జీవవైవిధ్యం ముప్పు, అంతరిస్తున్న జీవరాశులు, మానవ మనుగడకు ఏర్పడుతున్న ఆపద తదితర అనేకాంశాలపై ప్రజా వాగ్గేయకారులు స్పందించారు. వీరు సాహిత్య విషయంగా విశ్లేషణకు మీవంటి ఆలోచనాపరుల, సంవేదనాశీలుర సృజనకారుల ఆలోచనలు, అభిప్రాయాలు, దృక్పథాలు, సూచనలు, సలహాలు అవసరమని భావించి ఒక సంక్షిప్త ప్రశ్నావళిని మీకు పంపుతున్నాను. శ్రమ అనుకోకుండా ఈ ప్రశ్నావళికి సమాధానాలు సకాలంలో ఇచ్చి అధ్యయనానికి తోడ్పాటును ఇవ్వాల్సిందిగా మనవి చేస్తున్నాను. 1) ప్రజావాగ్గేయ సాహిత్యంగా మీరు దేనిని పరిగణిస్తారు? 2) మీ దృష్టిలో ప్రజావాగ్గేయ కారులు 3) ప్రకృతి, పర్యావరణ సమస్యలపై ప్రజావాగ్గేయకారులు స్పందించడానికి కారణం? 4) 'మనిషి పర్యావరణ విధ్వంసకుడు' అన్న వాదం గురించి మీ ఆలోచన 5) పర్యావరణ సమస్యలపై వచ్చిన వచన కవిత్వం, కథ, నవలల్లాంటివి మీ దృష్టిలో ఏవి? 6) పర్యావరణ సమతుల్యత సాధించే విషయంలో మీరు సూచించే ప్రత్యామ్నాయం ? 7) తెలుగు సాహిత్యంలో ప్రకృతి, పర్యావరణ చిత్రణ ఇంతకు ముందు జరిగిందా? 8) 1980–90ల మధ్య కాలంలోనే పర్యావరణ స్పృహ చైతన్యాలు పెరగడానికి కారణం? 9) పారిశ్రామిక సమాజాల ఆవిర్భావమే పర్యావరణ విధ్వంస హేతువు అనేవాదం గురించి మీ వ్యాఖ్య? 10) మీ రచనలో పర్యావరణ స్పర్శ గలవి.. 11) తెలుగు సాహిత్యం (ప్రజావాగ్గేయకారులను మినహాయించి) పర్యావరణ, స్పృహ చైతన్యాల దిశగా మరలిన సూచనలు మీ దృష్టికి వచ్చాయా? 12) తెలుగు సాహిత్యాన్ని పర్యావరణ దృష్టి కోణంతో పరిశీలించాల్సిన అవసరం గురించి మీ మాట 13) అభివృద్ధి, ప్రగతి అనే భావనలు మానవాళికి చేసిన మేలు – కీడు ? 14) Eco criticim తెలుగులో రూపొందకపోవడానికి కారణాలు? 15) తెలుగులో 'హరితవాద సాహిత్యం' ఒక ప్రత్యేక వాదంగా నిలిచే అవకాశాలు ఈ అంశాలపై సమాచారం ఇవ్వగలరు. ఈ చిరునామాకు సమాచారం అందించగలరు : –డా. ఆర్. సీతారామారావు, తెలుగు లెక్చరర్, తెలుగు విభాగం, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, మహబూబాబాద్, వరంగల్ జిల్లా – 506101, సెల్ : **9866563519.**

**- ఆర్. సీతారామారావు**




నివాళి

## గిడుగు రాజేశ్వరరావు కన్నుమూత

తెలుగు సాహిత్యంలో కథ, గేయం, పాట, పద్యం, సంగీత రూపకం, జీవిత చరిత్రలు తదితర సాహిత్య ప్రక్రియల్లో తన ప్రావీణ్యాన్ని చాటిన సుప్రసిద్ధ రచయిత గిడుగు రాజేశ్వరరావు జులై 21న ఢిల్లీలో కన్నుమూశారు. ఢిల్లీ నుండి హైదరాబాద్‌కు వెళ్లేందుకు రైల్వేస్టేషన్ చేరుకున్న ఆయన గుండెపోటుతో ఆకస్మిక మరణానికి గురయ్యారు. 83 ఏళ్ల రాజేశ్వరరావుకు కుమారుడు, కుమార్తె ఉన్నారు. ఆంధ్ర పండితుల భాషా భేషజాన్ని ఖండించి, వ్యవహారిక భాషా ఉద్యమానికి పితామహుడుగా నిలిచిన గిడుగు రామ్మూర్తి మనమడు గిడుగు రాజేశ్వరరావు. నవంబర్ 7, 1932లో పర్లాకిమిడిలో జన్మించిన ఆయన 1953లో ఉత్కళ విశ్వ విద్యాలయం నుండి డిగ్రీ పొందారు. ఏజీ ఆఫీసులో 1991 వరకు పనిచేసి అసిస్టెంట్ ఆడిటర్ హోదాలో రిటైరయ్యారు. 1980లో ఏజీ ఆఫీసు తెలుగు సాహితీ సమితికి అధ్యక్షులుగా వ్యవహరించిన రాజేశ్వరరావు 80 కథానికలు రాశారు. ఆయన రచించిన బ్రతుకు భయం, రాగిరేకు, కర్మయోగులు వంటి కథానికలు బహుమతులను అందుకున్నాయి. ఆయన రచించిన రాగవీచికలు, మల్లెపందిరి కావ్యాలను గరికపాటి సాహిత్య పురస్కారం, ఆంధ్ర సారస్వత సమితి పురస్కారం, ముదిగొండ సాహిత్య పురస్కారాలు లభించాయి. గిడుగు రాజేశ్వరరావు కథలు, కాళింది వెన్నెల, పూలతేరు, అమూల్య లక్షణాలు, పిల్లలకు పిట్ట కథలు, రాగవీచికలు, భావవీచికలు, తదితర గీత మాలికలు మాకంద స్పందనలు, రాజమకుటాలు తదితర పద్య శతకాలు, ఉదాత్త చరిత్రుడు గిడుగు జీవిత గ్రంథాలను రచించారు.

---

## అద్దేపల్లికి రసధుని అవార్డు



**పా**లకొల్లు రసధుని సాహితీ సంస్థ ఆధ్వర్యాన అందించే శ్రీ పెద్దిభొట్ల బ్రహ్మయ్య స్మారక అవార్డును ప్రముఖ సాహితీవేత్త, అభ్యుదయ కవి అద్దేపల్లి రామమోహనరావుకి ప్రదానం చేశారు. జూన్ 30వ తేదీన స్థానిక లయన్స్ కమ్యూనిటీహాల్‌లో జరిగిన ఈ సభకు రసధుని అధ్యక్షులు వంగా నరసింహరావు అధ్యక్షత వహించగా, స్థానిక ఇన్‌కంటాక్స్ అధికారి యం.యస్. సుకుమార్ ముఖ్య అతిథిగా విచ్చేశారు. ఆయన రామమోహనరావు తెలుగు సాహిత్యానికి అందించిన సేవలు కొనియాడారు. ఈ సభకు ముఖ్యవక్తగా విచ్చేసిన ఏలూరు ప్రభుత్వ కళాశాల ప్రధానాచార్యులు, ప్రముఖ కవి కొప్పర్తి వెంకట రమణమూర్తి మాట్లాడుతూ ఆయన విరామం ఎరుగని కవి అని, సమాజం కోసం అనేక రచనలు చేశారని మొదటి దశలో భావకవిగా, రెండవదశలో అభ్యుదయ కవిగా, మూడవ దశలో నిబద్ధత వున్న అభ్యుదయ కవిగా ఉంటూ, నాల్గవ దశలో ప్రపంచీకరణకు వ్యతిరేక రచనలు చేశారు అని ఆయన అన్నారు. రామమోహనరావు వ్రాసిన కవితలలో కొన్నింటిని సోదాహరణంగా వివరించారు. మరొక వక్తగా కొత్తపేట ప్రభుత్వ కళాశాల ప్రధానాచార్యులు ఆర్.ఎస్. వెంకటేశ్వరరావు మాట్లాడుతూ రామమోహనరావు రెండవ పార్శ్వం సాహితీ విమర్శ అని, నాడు శ్రీశ్రీ కవిత్వం మీద రాసిన సాహితీ విమర్శ ఎందరినో ఆకర్షించిందని రామమోహనరావు వ్రాసినన్ని పీఠికలు ఆంధ్రదేశంలో ఎవరూ వ్రాయలేదని తెలియజేశారు. నేడు బహుప్రాచుర్యం పొందిన మినీ కవితకు ఆయన సిద్ధాంత కర్త అని ఆర్.ఎస్. తెలియచేశారు. అద్దేపల్లి సమాధానం ఇస్తూ నేటి ప్రపంచీకరణ ప్రభావం దేశంలోని అన్ని రంగాలలోను ఉందని తద్వారా భారతీయత తెరమరుగు అవుతున్నదని, దానిని కాపాడవలసిన బాధ్యత భారతీయుల అందరిమీద ఉన్నదని ఆయన తన ఆవేదనను తెలియచేశారు. ప్రముఖ ఆడిటర్ పెద్దిభొట్ల లక్ష్మీనారాయణ తన తండ్రి బ్రహ్మయ్య పేరున గత పదిహేను సంవత్సరాలుగా ఇస్తున్న అవార్డు 7వేల రూపాయల నగదు, జ్ఞాపిక, దుశ్శాలువలతో రామమోహన్‌రావుని సత్కరించారు. ఇంకా ఈ సభలో ప్రముఖ కవులు కడిమెళ్ళ వరప్రసాద్ గురు సహస్ర అవధాని, రెడ్డప్ప ధవేజి, కె.యస్.మూర్తి, భగవాన్, చేగొండి రంగారావు, పట్టణ ప్రముఖులు బొండాడ రాధారమణ్ గుప్త, విన్నకోట వెంకటేశ్వరరావు, కొల్లి నరసింహమూర్తి తదితరులు రామమోహనరావును ఘనంగా సత్కరించారు. ఈ కార్యక్రమానికి వి.కె. సత్యనారాయణ, జె.దుర్గారావు, వై. ప్రభాకర శాస్త్రి తదితరులు సారథ్యం వహించారు.

– వంగా నరసింహారావు

# సవాళ్ళకు ఎదురొడ్డి నిలిచిన జాషువా




జాషువా వర్ధంతి సభలో ప్రసంగిస్తున్న సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి. చిత్రంలో వెంకటి, ద్వానా శాస్త్రి, గేరా.

సామాజిక సవాళ్ళను ఎదిరించి నిలబడిన వ్యక్తి జాషువా అని సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి అన్నారు. సాహితీస్రవంతి హైదరాబాద్ నగర కమిటీ ఆధ్వర్యంలో జూలై 24న సుందరయ్య విజ్ఞానకేంద్రంలోని దొడ్డి కొమరయ్య హాలులో జాషువా వర్ధంతి సభ జరిగింది. ఈ సందర్భంగా డా.ద్వా.నా. శాస్త్రి రచించిన 'జాషువా గుండెచప్పుళ్ళు' పుస్తకాన్ని తెలకపల్లి రవి ఆవిష్కరించారు. ఆవిష్కరణ అనంతరం ఆయన మాట్లాడుతూ జాషువా సామాజిక భాష్యమే కాకుండా కులమతాలు గీసిన గీతలకు కట్టుబడకుండా ఆ హైందవ ధర్మాలకు వ్యతిరేకంగా పోరాడిన వ్యక్తి అన్నారు. ఈ సమయంలో జాషువా అనేక అవమానాలను ఎదుర్కొన్నాడని, అయినా ఆయన పయనం ఆపలేదని అన్నారు. జాషువా కవిత్వాన్ని రెండు రకాలుగా చూసేవారున్నారని తెలిపారు. చర్చలు ఎలా జరిగినా జాషువా కవిత్వం వెనకున్న అసలు విషయాన్ని చూడాలన్నారు. ఈ కార్యక్రమంలో ముఖ్య అతిథిగా పాల్గొన్న డా. ద్వా.నా. శాస్త్రి మాట్లాడుతూ జాషువా ఉత్తమ కవిత్వాన్ని రాశాడని అన్నారు. బాధల నుంచే కవిత్వం పుట్టుకొచ్చిందనీ, అదే 'గబ్బిలం' కావ్యంగా వెలువడిందని అన్నారు. ఆర్ద్ర హృదయం ఉండాలని, మానవత్వం ప్రధానమని పదేపదే చెప్పిన జాషువా కవిత్వం నేటి సమాజానికి మరింత అవసరమని అన్నారు. ఈ కార్యక్రమానికి అధ్యక్షత వహించిన సాహితీస్రవంతి హైదరాబాద్ నగర కమిటీ ఉపాధ్యక్షులు, కవి గేరా మాట్లాడుతూ జాషువా శక్తివంతమైన కవిత్వాన్ని రాశారని అన్నారు. జాషువా కవిత్వాన్ని నేటి కవులు లోతుగా అధ్యయనం చేయాల్సిన అవసరం ఉందని ఆయన అన్నారు. అనంతరం సాహితీస్రవంతి హైదరాబాద్ నగర కమిటీ సభ్యులు వెంకటి ఆధ్వర్యంలో జనకవనం జరిగింది. పలువురు కవులు, కవయిత్రులు తమ కవితలను చదివి




హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞానకేంద్రంలో ద్వానా శాస్త్రి రచన 'జాషువా గుండె చప్పుళ్ళు' పుస్తకాన్ని ఆవిష్కరిస్తున్న తెలకపల్లి రవి. చిత్రంలో వెంకటి, ద్వానా శాస్త్రి, గేరా.

వినిపించారు. ఈ కార్యక్రమంలో ప్రముఖ సాహిత్యవేత్త మోతుకూరి నరహరి, శాంతిశ్రీ, జి. నరేష్, నాగశిరీష, పొత్తూరి సుబ్బారావు, కేతవరపు రాజ్యశ్రీ, వి.యస్.వి. ప్రసాద్, కె.ఎక్స్. రాజు, పి.ఎన్. మూర్తి, జి. నరసింహమూర్తి, వొరప్రసాద్, సాహిత్యప్రకాశ్, కె.వి. శాస్త్రి, మౌనశ్రీ మల్లిక్, పెద్దూరి వెంకటదాసు, ఒబ్బిని సన్యాసిరావు, చిక్కా రామదాస్, ఎ. మోహనకృష్ణ, టి. సైదులు తదితరులు పాల్గొన్నారు. సాహితీస్రవంతి హైదరాబాద్ నగర కమిటీ కోశాధికారి వి.వి.ఆర్. శాస్త్రి కార్యక్రమానికి స్వాగతం పలకగా నగర సంయుక్త కార్యదర్శి తంగిరాల చక్రవర్తి వందన సమర్పణతో కార్యక్రమం ముగిసింది.

# అనంతపురంలో జాషువా వర్ధంతి

సాహితీస్రవంతి అనంతపురం నగర కమిటీ ఆధ్వర్యంలో జూలై 24న అనంతపురంలో జాషువా వర్ధంతి కార్యక్రమం జరిగింది. నగరంలోని టవర్‌క్లాక్ వద్దగల జాషువా విగ్రహానికి కవులు, రచయితలు పూలమాల వేసి నివాళి అర్పించారు. జాషువా ఆశయాలు సాధిస్తామని నినాదాలతో ప్రతిజ్ఞ చేశారు. సాహిత్యం సామాజిక ప్రయోజనం ఆశించాలని, ఈ మార్గంలోనే జాషువా తన సాహితీ ప్రపంచాన్ని ఆవిష్కరించాడని, ఆనేక ప్రతికూలతలను ఎదుర్కొని కవిత్వమనే ఆయుధంతో విజయం సాధించాడని సాహితీస్రవంతి నగర కమిటీ ప్రధాన కార్యదర్శి సురేష్ అన్నారు. జాషువా తన సాహితీజీవితంలో 36 గ్రంథాలు రాశారని, ఎన్నో కవితా ఖండికలు రాశారని అన్నారు. 1932 వ సంవత్సరంలో ఫిరదౌసి, 1941లో గబ్బిలం రాశారని, గబ్బిలం కావ్యం ఎంతో ప్రసిద్ధి చెందిందని అన్నారు. 1958 వ సంవత్సరంలో రాసిన క్రీస్తు చరిత్ర కావ్యానికి గాను 1964వ సంవత్సరంలో కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు జాషువా అందుకున్నారని అన్నారు. తెలుగు ప్రజల హృదయాల్లో జాషువా నవయుగ కవిచక్రవర్తిగా నిలిచిపోయారని అన్నారు. ఈ కార్యక్రమంలో సాహితీస్రవంతి రాష్ట్ర కమిటీ సభ్యులు పి. కుమారస్వామి, అంకె రామలింగయ్య, కిరణ్, ఈశ్వరయ్య తదితరులు పాల్గొన్నారు.




అనంతపురంలో టవర్‌క్లాక్ వద్దగల జాషువా విగ్రహానికి పూలమాల వేసి నివాళి అర్పిస్తున్న సాహితీస్రవంతి అనంతపురం నగర కమిటీ సభ్యులు



జులై 9, మంగళవారం విశ్వసాహితి, త్యాగరాయగానసభ సంయుక్త ఆధ్వర్యంలో కళాసుబ్బారావు కళావేదికపై శిష్టామాధవి రచించిన 'మాతృభాషా వైభవం' కవితా సంపుటిని ఆవిష్కరిస్తున్న 'నేటినిజం' సంపాదకులు బైస దేవదాస్. వేదికపై గూడూరి విజయలక్ష్మి, డా॥ పుటిగడ్డ విజయలక్ష్మి, కవయిత్రి శిష్టా మాధవి, డా॥ జయరాములు, డా॥పోతుకూచి సాంబశివరావు, డా॥ ద్వా.నా.శాస్త్రి, సినీ దర్శకుడు, లక్ష్మణరేఖ గోపాలకృష్ణ, డా॥ కళావేంకట దీక్షితులు.



జూన్ 23న విశాఖ పౌర గ్రంథాలయంలో అరసం (విశాఖశాఖా) మార్క్సిస్ట్ అధ్యయన కేంద్రం, ఆధ్వర్యంలో కవి పి. అనంతరావు రచించిన కవితా సంపుటి 'పొగజెండా' ఆవిష్కరణ సభలో (ఎడమ నుండి) పి. అనంతరావు, జె.వి సత్యనారాయణ మూర్తి, చందు సుబ్బారావు, పెనుగొండ లక్ష్మినారాయణ, జగద్ధాత్రి, అడపారామకృష్ణ మున్నుగువారు పాల్గొన్నారు.



డా. గంధం సుబ్బారావు పిహెచ్‌డి సిద్ధాంతవ్యాసం "కాశీ మజిలీ కథలు - ఒక అనుశీలన", గ్రంథాలను హైదరాబాద్‌లోని పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఆడిటోరియంలో రాష్ట్ర సమాచార పౌరసంబంధాల శాఖామాత్యులు డి.కె. అరుణ ఆవిష్కరించిన దృశ్యం. చిత్రంలో ఆచార్య వి. నిత్యానందరావు, కిన్నెర ఆర్ట్స్ థియేటర్స్ అధినేత మద్దాలి రఘురాం, డా. గంధం సుబ్బారావు, సభాధ్యక్షులు డా. ఎన్. గోపి, శాసనమండలి అధ్యక్షులు డా. ఎ. చక్రపాణి, కృతిస్వీకర్త అధికార భాషా సంఘం అధ్యక్షులు మండలి బుద్ధ ప్రసాద్, గంధం చంద్రశేఖరరావు ఉన్నారు.



జూన్ 17న ఆంధ్ర సారస్వత పరిషత్ హాల్‌లో, హైదరాబాద్ వెన్నెల ఆర్ట్స్ అసోసియేషన్ ఆధ్వర్యంలో ఆచార్య మసన చెన్నప్ప రచించిన 'సడిలేని అడుగులు' (గీతాంజలి కావ్యానువాదం) ఆవిష్కరణ జరిగింది. సభలో ఆవిష్కర్త జస్టిస్ బి. చంద్రకుమార్. సభాధ్యక్షులు ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి విశిష్ట అతిథి డా॥ కె.వి. రమణాచారి, కృతి సమీక్షకులు డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులు, కృతి స్వీకర్త సరిపంగి మహేశ్వర్, ఆత్మీయ అతిథి డా॥ తిరునగరి పాల్గొన్నారు.



డా॥ సూర్యాధనంజయ్ రచించిన 'బంజారానానీ'లు పుస్తకాన్ని హైదరాబాద్ శ్రీత్యాగరాయ గానసభలో ఉస్మానియా విశ్వ విద్యాలయం వైస్ ఛాన్సలర్ ఆచార్య సిరాసాని సత్యనారాయణ ఆవిష్కరిస్తున్న దృశ్యం. చిత్రంలో డా॥ ఎం.ధనంజయనాయక్, ఆచార్య ఎస్వీ, సభాధ్యక్షులు ఆచార్య ఎన్.గోపి, ఆవిష్కర్త సిరాసాని, కవయిత్రి సూర్య, ఆచార్య మసన చెన్నప్ప, ఆచార్య ఎం. విజయశ్రీ ఉన్నారు.



సాధన సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో జూన్ 23న హైదరాబాదు రవీంద్రభారతి కాన్ఫరెన్స్ హాలులో జరిగిన 'జ్ఞానసింధు సర్దేశాయి తిరుమలరావు' గ్రంథావిష్కరణ దృశ్యం చిత్రంలో డా. వెనిగెళ్ల రాంబాబు, ఆచార్య ముదిగొండ శివప్రసాద్, డా.కె.వి. రమణాచారి, ఆచార్య ఎల్లూరి శివారెడ్డి, డా. నాగసూరి వేణుగోపాల్, కోడిహళ్లి మురళీమోహన్, దైవజ్ఞశర్మ, సాధన నరసింహాచార్య ఉన్నారు.

## విశాఖ సాహితీస్రవంతి ఆధ్వర్యంలో కవితల పోటీ





విశాఖపట్నం సాహితీస్రవంతి ఆధ్వర్యంలో జులై 6న ద్వారకానగర్‌లోని పబ్లిక్ లైబ్రరీలో "కవితల పోటీ" జరిగింది. "ఉత్తరాఖండ్ విషాదం" "మహిళలపై హింస" అనే రెండు అంశాలపై నిర్వహించిన ఈ కవితలపోటీలో 21 మంది కవులుపాల్గొని తమ కవితలు వినిపించారు. జి.వి.ఎన్. చలపతి (సాహితీ స్రవంతి జిల్లా బాధ్యులు) మోదురాజేశ్వరరావు (రచయిత) న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించారు. ఈ క్రింది కవులకు బహుమతులు అందజేయడం జరిగింది.

1. మొదటి బహుమతి **"చుక్కల్లో రక్తధార" - ఎం. పవన్ కుమార్** 2. ద్వితీయ బహుమతి **"మమ్మల్నిలా బ్రతకనివ్వండి" - మొదలవలస పద్మావతి** 3. తృతీయ బహుమతి **"చంక సంచి" - మోకారత్నరాజు** 4. కన్సొలేషన్ **"నిర్భయ మురళిఘోష" - నాయని కళ్యాణి శ్రీదీప్తి** విజేతలకు శ్రీమతి పద్మ (ఐద్వా, నగర కార్యదర్శి) రమణాచలం కన్వీనర్, సాహితీ స్రవంతి, అరుణ్‌జీ, ప్రనాలే బహుమతులు అందచేశారు. కార్యక్రమానికి ఎ.వి. రమణారావు, అధ్యక్షత వహించారు. వరప్రసాద్ వందన సమర్పణ చేశారు. సాహితీ స్రవంతి కార్యదర్శి నూనెల శ్రీనివాసరావు జ్ఞానపీఠ అవార్డు గ్రహీత రావూరి భరద్వాజ సాహిత్యంపై సంగ్రహంగా ప్రసంగించారు. కార్యక్రమంలో సాహితీ అభిమానులు పెద్దఎత్తున పాల్గొన్నారు.

## విసురు గ్రంథావిష్కరణ

సాహితీ స్రవంతి కాకినాడ టౌన్ శాఖ ఆధ్వర్యంలో జూలై 7వ తేదీ సా. 6గం॥ గాంధీభవన్‌లో గరికపాటి మాష్టారు అధ్యక్షతన తంగిరాల చక్రవర్తి స్వీయ కవితాసంపుటి "విసురు" ఆవిష్కరణ సభ జరిగింది. ప్రముఖ కవి, విమర్శకులు డా॥ అద్దేపల్లి రామమోహన్ రావు గారు గ్రంథావిష్కరణ చేసారు. రెక్కలు ప్రక్రియ నేటి ఆధునిక కవితా యుగంలో కొత్తదారులు తెరచిందని.. సామ్రాజ్యవాద వ్యతిరేక రెక్కలుగా "విసురు" సంపుటిని శ్లాఘిస్తూ డా॥ అద్దేపల్లి మాట్లాడారు. మాకినీడు సూర్యభాస్కర్, వి.ఎస్.ఆర్.ఎస్. సోమయాజులు, గ్రంథ సమీక్ష చేసారు. కాలనాధ భట్ట వెంట్రామ శాస్త్రి కవి చక్రవర్తిని "అద్దేపల్లి ఫౌండేషన్ సాహితీ పురస్కారంతో సత్కరించారు. పెళ్ళి వారిల్లు అంశంపై కవి సమ్మేళనం జరిగింది. "గనారా" స్వాగతం, వందన సమర్పణ చేసిన ఈ సభలో దాట్ల దేవదానం రాజు, ఫ్రెంచ్ కవి డేనియల్, శ్రీవత్స రామకృష్ణ, టి.జి. సాయి దంపతులు అతిథులుగా హాజరయ్యారు. దాదాపు 40 మంది కవులు స్వీయ కవితలు చదివారు.



అద్దేపల్లి ఫౌండేషన్ ప్రచురించిన తంగిరాల చక్రవర్తి రచన "విసురు" గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్న అద్దేపల్లి రామమోహన్‌రావు. చిత్రంలో సోమయాజులు, గరికిపాటి మాష్టారు, మాకినీడు సూర్యభాస్కర్ తంగిరాల, కె.వి. శాస్త్రి, గనారా.



జులై 7న హైదరాబాద్ త్యాగరాయ గానసభ కళా సుబ్బారావు కళా వేదికలో జి.వి.ఆర్. ఆరాధన కల్చరల్ ఫౌండేషన్ నిర్వహించిన కార్యక్రమంలో పొత్తూరి సుబ్బారావు రచించిన 'హృదయవేదనవనంలో' వికసించిన కవితా సుమాలు పుస్తకాన్ని సమాచార శాఖ పూర్వ సంచాలకులు యం. ప్రమోదరావు ఆవిష్కరించారు. చిత్రంలో మౌనశ్రీ మల్లిక్, వి.వి. రాఘవరెడ్డి, కళా వెంకట దీక్షితులు, డా॥ ద్వా.నా. శాస్త్రి, డా॥ తిరునగరి, గుదిబండి వెంకటరెడ్డి, తంగిరాల చక్రవర్తి, డా॥ పులివర్తి కృష్ణమూర్తి ఉన్నారు.

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**

# దేవరకొండ బాలగంగాధర తిలక్

21.08.1921–01.07.1966



‘అమృతం కురిసిన రాత్రి’ వీరి ప్రసిద్ధ కవితా సంపుటి. గోరువంకలు, సీత కావ్యాలు రాశారు. నల్లజెర్ల రోడ్, ఊరి చివరి ఇల్లు వీరి ప్రసిద్ధ కథలు. కవిత్వంలోనూ, కథారచనలోనూ సమానస్థాయిలో ప్రతిభ చూపిన రచయిత.

SHAITYA PRASTHANAM RNI N0.APTEL/ 2004/18396 Postal Regd. No.H/SD/415/13-15

PRSVIMO2A152

# ప్రజాశక్తి బుక్‌హౌస్ తాజా ప్రచురణలు



వెల: రూ. 120/-



వెల: రూ. 140/-



వెల: రూ. 30/-



వెల: రూ. 25/-



వెల: రూ. 100/-



వెల: రూ. 20/-



వెల: రూ. 100/-



వెల: రూ. 40/-



వెల: రూ. 30/-



వెల: రూ. 25/-



వెల: రూ. 650/-



వెల: రూ. 125/-



వెల: రూ. 90/-



వెల: రూ. 90/-



వెల: రూ.150/-



వెల: రూ. 80/-



వెల: రూ. 25/-



వెల: రూ. 60/-



వెల: రూ. 150/-



వెల: రూ. 300/-

ప్రతులకు: ప్రజాశక్తి బుక్‌హౌస్, ఫోన్: 040-27660013 27608107, ఫ్యాక్స్: 04027635136

**If Un delivered please return to :** Prasthanam, C/o M.H.Bhavan, Plot No. 21/1, Azamabad
Near RTC Kalyanamandapam, Hyderabad - 500 020 (A.P), Ph: 040-27660013, Cell: 9490099059



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
| పుస్తకం సంఖ్య | PRSVMORA152 |
| పుస్తకం పేరు | Ca స్నానం |
| తారీఖు | 25-5-24 |
| ముందు అట్ట | yas |
| వెనుక అట్ట | yas |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Kaveed |
| పేజీలు విడదీసినది | Kaveed |
| స్కాన్ చేసినది | Gayatri |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |